# బ్రహ్మలోకం

(వైజ్ఞానిక)

‘చంద్ర’

యువ బుక్ డిపో
మద్రాసు & తెనాలి

కాని ఆ గృహము పావనమైనది. సమస్తకాలమూ, పురాణపఠనమూ, మంత్రజపమూ, యాగమూ, పూజా; వీటిలోనే నిమగ్నులై వుండేవారు స్త్రీ పురుషులు. ప్రయాణమూ, వార్తాపత్రికలూ, కలహామూ, సంస్కారమూ, ఇవి ఎన్నడూ ఆ వైపులకు రావు. నీచభావాలూ, భౌతిక కాంక్షలూ, యీర్ష్య, ఆపేక్షా, వీటి నెరగనే యెరగరు. దేహాలూ, గదులూ, భోజనమూ, శుచీ, మనసూ, ఆలోచనలూ వున్నతాలుగా వుంచకోడం అలవాటై పోయింది. ఆయింటి చుట్టూగాని, వాళ్ల పాత్రలలోని జలమే, ఒక విధమైన నిర్మలమైన పరిమళాన్ని కలిగివుండేది.

ఆ వంశంవాళ్లందరూ గర్విష్టులు, అధికారవంతులు. ప్రపంచ సంబంధం పెట్టుకోరు. కాని పాలము కాపులు, కరణాలు, పండితులు, అందర్నీ అధికారవంతంగా, నిర్లక్ష్యంగా, తక్కువగా చూసి మాట్లాడడం అలవాటయింది. ఆ వూరివారు ఇచ్చిన గౌరవమే అట్లా మార్చింది వాళ్లని. ఇతరులతో పని పెట్టుకోరు, యాచించరు—తమ సౌఖ్యాలను, ధనాన్ని, పొలాలను వొదులుకున్నారు గాని, లౌకికాధికారుల్ని ఒక్కర్ని యాచించలేరు.

తరతరాలనించి శిష్టాచారపరులై, నియమాలు తప్పని నిర్మలమైన అభ్యాసాలు కలిగి, భక్తిలో, భయంలో పితృదేవతల్నీ, ఉష్టదేవతల్నీ పూజించే వైదిక సాంప్రదాయం కలిగిన వుత్తమ బ్రాహ్మణ వంశంలో పుట్టడంచాత, ఆ వంశం వారందరూ ధ్యానించే దేవతల సౌందర్యమంతా సుందరమ్మలో మూర్తీభవించిందా అని తోస్తుంది. ఆమె అందమంతా కదలని, నవ్వని, నిబ్బరపు శాంతివిగ్రహపు సౌందర్యం లాగున వుంటుంది. మాటలూ, నవ్వులూ, గంతులూ లేక, నెమ్మదిగా చందమామవలె, చల్లగా ఆ చీకటి యింటలో, శబ్దంలేకుండా, తళుకుతో వుంటుంది. పుట్టినప్పటి నించీకూడా, ఆమె కళ్లలో ఉదారమైన ఖేదం తోస్తుంది. కళ్లు కోలగా శాస్త్రాలలో వర్ణించినట్లు, నల్లని కనిబొమ్మలకింద, పరుచుకుని, కణతలమీద పడే జుట్టుని తాకుతో వుంటాయి. కనుపాపలు—తెల్లని మబ్బుకింద సగం మాయమయే చంద్రుడివలె దిగులు కొల్పుతో రెప్పలకింద సగం అణిగి వుంటాయి. పసితనంలో కూడా ఆమె యెక్కువ విలాసాలు చూపకపోయినా, ఆమెని చూడడమే ఆనందం, ఆమె నడకలే నవ్వులు, ఆమె ముఖకాంతులే ముచ్చట్లు.

పెళ్ళి ఐన దాకా కూడా సుందరమ్మ తనయిల్లు తప్ప ప్రపంచ మెరగదు. శాస్త్రాలు, వేదాంతాలు, పురాణాలు తప్ప వేరే విజ్ఞానము ఆమె మనసులో లేదు. పూజలతో, కర్మకలాపాలతో మునిగిన ఆ పల్లెటూరు కుటుంబంలో, కాలమాగి పోయింది. దేశమంతా కాలచక్రానికీ, కర్మానుభవానికీ లోబడి తిరిగిపోయి, మారిపోతూ వుంటే, ధ్రువ నక్షత్రంలాగు ఆవంశం పురాతన సత్వంలో, అట్లాగే నిలిచిపోయింది. మోటార్లు, వితంతు వివాహాలు, లెజిస్లేటివ్ కౌన్సిళ్ళు, సంస్కరణ విధానాలు, ఆంధ్రోద్యమాలు, వీటి మోత దూరం నించి, ఏదో పాతాళలోకంనించి కొంచెం కొంచెం వినపడుతూ వుంటుంది; ఆయింట్లో వాళ్ళకి.

సుందరమ్మ ముఖ్యమైన సుగుణమూ, ఆమె లోపమూకూడా భూతదయ. తాను ఎంత స్వల్ప విచారాన్నైనా భరించలేదు. కాని ఎవరిలోనైనా, చివరకి చీమ నీళ్ళలోపడినా, తాను సహాయం చెయ్యకుండా వుండలేదు. సహజమైన యీ దయవల్ల ఆమె అనాచారాలకి దిగి తన బంధువులకి చాలా విషాదం కలిగించిన సమయాలు అనేకమున్నాయి.

ఎనిమిదో యేటనే మేనత్త కొడుకుకీ సుందరమ్మకీ పెళ్ళి చేశారు. పెళ్ళి కాగానే అతను మైసూరు సంస్కృత విద్యాభ్యాసానికై వెళ్ళి ఆరేళ్ళు అక్కడే గడిపి వొచ్చినందువల్ల సుందరమ్మ అతన్ని చూడనేలేదు. అతను మైసూరునించి సరాసరి మామగారి యింటికి వొచ్చి కార్యము చేసుకుని, భార్యని తనతో తీసుకుని వెళ్ళాడు. సుందరమ్మ భర్త, పండితుడు, సౌమ్యుడు, రసికుడు. శృంగార కావ్యాలలోని వర్ణనలు పఠించినప్పుడల్లా, వాటి అన్వయం కన్న వ్యాకరణంకన్న వాటి సౌందర్యం మీదనే దృష్టినివుంచి పుట్టింట్లో పెరుగుతున్న భార్యని తలచుకునేవాడు. లోకాన్ని చూసినవాడు, కాని తన శాస్త్రములో విశ్వాసం చెడనివాడు. సుందరమ్మని చూడగానే అతనికి ఏకాగ్రత యేర్పడ్డది. వాళ్ళవూళ్ళో మూలనున్న యింటిని డాబాగా మార్చి, ఒక మేడగది కట్టించాడు. ఆగదిలో భార్యతో కూడా మాయమై ప్రపంచంతో సంబంధం కల్పించుకోడం మానివేశాడు:

ఎర్ర కలువవలె విచ్చిన ఆమె అందాన్ని చూచి అతను సమ్మోహనుడైనాడు. ఎరుపు నునుపులో నించి క్రమంగా తెలుపు నీడలోనికి మారే ఆమె తని దేహకాంతులూ, యెర్రగా కస్తూరి పరిమళంతో కూడిన పెద

వులూ, ప్రేముడిముద్దుల నెరగక నిద్రపోతున్నట్లు, పొడుగైన కనుబొమ్మల కింద మూర్ఛలు పొయ్యే కళ్లూ, నున్నని రాళ్ళమీద నించి దొర్లే ప్రవాహం లాగ మెరిసే బుజాలమీద నించి వేళ్లాడే జుట్టూ, నాజూకైన కంఠం చివర వెగ్గ పువ్వువలె వికసించిన ముఖమూ, ఆమె ఠీవీ, నిదానమూ, బలువూ, తులసీదళాలూ, కర్పూరమూ, కుంకమూ, కలిసి యింకెగా యేర్పడ్డ దేహ పరిమళమూ—యీ ఆభరణాలతో వొచ్చింది సుందరమ్మ అతని యింటికి. కాళిదాసు వర్ణనలూ, శంకరుడి దేవీస్తవమూ, తన ప్రత్యేక స్వప్నాలూ కలిసి, మూర్తిభవించినట్లు తోచింది సుందరమ్మ.

అతని తల్లీ, సన్యాసం పుచ్చుకుని సంసారాన్ని దయార్ద్ర హృదయులకు వొదిలి వెళ్లిన మేనమామ భార్యా పిల్లలూ, అతని బంధువులు. వెనక అతని సేవ అతి సౌఖ్యప్రదంగా జరుగుతుంది.

ఆపైన గదిలోనుంచి వాళ్లకి, మామిడి చిగుళ్ల మీది మంచు బొట్లూ, కాంతిలో కనబడకుండా దూసుకుపొయ్యే చిలకల రంగులూ, పచ్చని చేల మీద నీడలుపడేస్తో పయనమయ్యే మబ్బులూ తప్ప యింకేమీ కనిపించవు. కోయిల కంఠమూ, జెముడు కాకి మూలుగూ, యీలపిట్టల కూతలూ, కలువ పూలల పాటలూ తప్ప యింకేమీ వినిపించవు. ఇవన్నీ చూశారో లేక ఒకరి నొకరు చూసుకోడంలో ప్రమత్తులైనారో, ఆ శబ్దాలన్నీ విన్నారో, లేక అలిసి మూర్ఛలుపోయి, అన్నిటికీ అతీతులైనారో! మొదట్లో వెన్నెల రాత్రులు తోటలోకి దిగివొచ్చేవారు. తరవాత మానేశారు. కొన్నాళ్లు ఉదయాన వొంటిగంటకి భోజనానికి దిగేవారు. అదీ మానేశారు. సుందరమ్మే భోజనం పైకి తీసుకెళ్తోంది. భోజనం వొండిపెట్టడం తప్ప కింది వాళ్ళకీ పైవాళ్ళకీ సంబంధం లేదు. కొత్తగా వొచ్చిన మైసూరు పండితుడి పాండిత్యము గ్రహిద్దామనీ, దూరపు మైన బంధువుణ్ణి ఆదరిద్దామనీ, తాము సాగుచేసే పొలాల అధికారిని చూడాలనీ వొచ్చిన జనమంతా కిందనే తిరిగి పోతున్నారు. వాళ్ళకేం జవాబు చెప్పాలో అతని తల్లికి తెలీటం లేదు.

పుట్టింటి నించి తల్లీ తండ్రీ వొస్తే, ఒక నిముషం కంటె ఎక్కువ మాట్లాడ డానికి సుందరమ్మకి శ్రద్ధ లేకపోయింది. ఎవరు వెళ్ళి తలుపు కొట్టినా తియ్యరు. కొట్టడానికి ఎవరికీ ధైర్యం లేదు. వినబడే వుంటారు; వినబడదా! సుందరమ్మ కిందికి వొచ్చినా, ఒక్క నిముషం ఆగదు. అతను యీలోపల

మాయమైపోతాడనో, విరహం భరించలేక మూర్ఛపోతాడనో — మాట్లాడదు — ఏడుస్తున్న చంటిపిల్లని వొదిలివచ్చిన తల్లివలె, పైకి పరిగెత్తు తుంది. కిందికి నవ్వులూ, పరుగులూ, పాటలూ మాత్రం వినబడతాయి. అప్పుడప్పుడూ పూలూ, గంధమూ, కస్తూరీ, తప్ప యింకే అవసరాలు లేవు పైవాళ్ళకి.

ఇట్లా రెండేళ్ళు గడిచినై.

ఒకరోజు పొద్దున్న సుందరమ్మ మేడ దిగివొచ్చి, అత్తగారితో —"మీ కొడుక్కి జబ్బుగా వుంది" అంది.

నెలరోజుల కిందనుంచి, కొడుకో కోడలో భోజనం తగ్గించారని ఆమెకి తెలుసు. కొడుకుమీది ప్రేమచేత, అతను తినగా వొదిలిన పదార్థాలున్న కంచాన్ని పరీక్షించి, అతని సాన్నిధ్యాన్ని కల్పించుకోవాలని ప్రయత్నించేది ఆమె. కాని ఆనంద భోజనం చేస్తూన్నారేమో, యింక యీ భౌతికాహారం అక్కర్లేదేమో, కొద్ది దినాల్లో యిదీ సంపూర్ణంగా విసర్జిస్తారుగావు ననుకుంది ఆమె. బతికివున్న యిరవై సంవత్సరాలలోనూ ఆమె భర్త ఆమెకున్న నాదస్తాన్నీ, నిశ్చయశక్తినీ, మూర్ఖాన్నీ, మనోబలాన్నీ, సంసార సుఖమనే పేరుకింద నాశనం చేశాడు. కనక పురుషుడంటే చాలా భయం, ఆలోచనలేని భక్తీ ప్రశ్నించని అడకువా చూపుతుంది.

వారంరోజులైనా కొడుకు జబ్బు తగ్గలేదు. వియ్యంకుడికి కబురంపింది. మోహతలుపులు తియ్యాక తప్పిందికాదు. ఆయన వొచ్చి, అల్లుడిలో మార్పు చూసి చాలా భయపడి చప్పున ఆయుర్వేద వైద్యుణ్ణి తీసుకొచ్చి మందిప్పించాడు. పదిహేను రోజుల్లో స్వస్థత కనపడ్డది. కాని ఆ వైద్యుడు 'రోగి భార్యతో రెండు నెల్లవరకు కాపరం చెయ్యకూడ' దన్నాడు. తండ్రి సుందరమ్మని తనతో తీసికెడతానన్నాడు. అల్లుడు వీల్లేదన్నాడు; కూతురూ రానంది. పత్యం మాత్రం చేస్తామని వొప్పుకున్నారు. కాని ఆరాత్రి కింద పడుకున్న కూతురు తెల్లారేప్పడికి మేడమీద తలుపు బిగించుకుని వుండడం చేత, తండ్రి దడిసి, కూతుర్ని బలవంతంగా ప్రయాణంచేసి తీసికెళ్ళాడు.

సుందరమ్మ తండ్రితో వెళ్ళిందన్నమాటేగాని ఇంటిదగ్గిర, ప్రాణాలన్నీ ఆ గోవారంటో వొదిలి వొచ్చినదానివలె, కదలక, మాట్లాడక, ఓమూల కూచుంది. కళ్ళనీళ్ళు పెట్టుకుంది, మరీబతిమాలి అడిగితే "నేను లేంది, ఆయన బతికేడు," అంటుంది. నాలుగోరోజు రాత్రి ఎవరో లేచి చూసేప్పటికి,

అల్లుడు సుందరమ్మ పక్కలో వున్నాడు. ఆరాత్రికి రాత్రి అన్ని మైళ్లు నడిచి వొచ్చాడట—పొద్దున్నే మామగారు చివాట్లేశారు. అతను మాట్లాడ కండా విని చిరునవ్వుతో "ఈ విషయం మీకర్థం కాదులెండి." అన్నాడు.

"ఇంట్లోంచి పొమ్మని యెట్లా అంటారు? సుందరమ్మని అందరి మధ్యా పెట్టుకు పడుకున్నారు. కాని పగలు ఒకర్ని వొకరు వదలరే! మాటిమాటికీ సుందరమ్మని పిలిచి పనులు చెప్పారు. కాని ఎంతసేపని ఎన్నిసార్లని కాపాడ గలరు? పని కాగానే అతనిదగ్గిరికి ప్రతిసారీ పరిగెత్తుతోవుంటే! ఒక రాత్రి వేళ దొడ్లో చప్పుడయింది. మామగారు గేదె యీనిందేమో నని వెడితే, తెల్లగా దెయ్యాలు రెండు కనబడ్డాయి. మంత్రంనీళ్లు మీద చల్లబోతే కూతురూ అల్లుడూగా మారారు. మర్నాడు రాత్రి సుందరమ్మని తల్లి పక్కలో పడుకో పెట్టుకుంది. కాని రాత్రివేళ లేచి వెళ్లిపోయింది సుంద రమ్మ. తండ్రికి చాలా కోపమొచ్చింది.

"ఇంతమాత్రం జ్ఞానం లేకపోతే యెట్లా?"

"నీకు అర్థం కాదు, నాన్నా!"

"నిజంగానే అర్థం గావటంలేదు. ఆరోగ్యం చెడగొట్టుకుని ఏం బావు కుందామని! అతని మీద నిజమైన ప్రేమవుంటే అతన్ని రక్షించడమే ముఖ్యంగా పెట్టుకుంటావు. ఇది పిచ్చి."

"ఆయన నిలవలేరు. నేనేం చెయ్యను?"

"బుద్ధి చెప్పు."

"నా చాత కాదు."

మర్నాడు రాత్రి అల్లుడే వొచ్చి తల్లీ, కూతురూ పడుకున్న మంచం పక్కన కూచున్నాడు. సుందరమ్మ రానంటుంది, అతను మాత్రం వెళ్లడు. ఇంక ఇంట్లోవాళ్ళందరికీ విసుగెత్తి ఏమనడానికీ తోచక, అసహ్యమేసి, ఈ కొత్తజబ్బుకన్న అపాత్రజబ్బే నయంగా కనపడి, ఎవరికర్మ ఎట్లాఉందో అట్లా జరుగుతుందని వూరుకున్నారు. ఐదోరోజున అల్లుడు మళ్లీ పక్క వేశాడు, కాని భార్యని వొదలలేదు.

తండ్రి మళ్లీ సుందరమ్మని గట్టిగా చివాట్లుపెట్టాడు.

"ఏమే, నీమొగుడికి బతకాలని లేదా యేమిటి? ఏదో వొకటి చెప్పండి, బోలెడు డబ్బుపోసి ఆమందులు కూడా కర్చెందుకు?"

సుందరమ్మ పెద్దగా యేడ్చింది.

"లాభంలేదు, నాన్నా! ఆయన నాకు దక్కరు. ఆ సంగతి ఆయనకీ తెలుసు. జాతకంలో ఇంతకన్న ఆయుస్సులేదు. ఆయనికి నేను కనపడక పోతే మరీ కొట్టుకుంటారు. ఆ నిమిషాన్నే ప్రాణం పోతున్నట్టు. కనపడితే సరేసరి. కాని నాన్నా, నాకర్మప్రకారం జరుగుతుంది. నువ్వు వూరికే చింతపడి ఏం లాభం? నాగతి తప్పించడం నీతరమా?"

ఏమంటాడు? చిన్నప్పణ్ణించీ తను మాట్లాడినవీ, తరతరాల నించీ వంశంలో నమ్ముతున్నవీ, జాతకాలూ, కర్మా. ఆమాటలు మరికూతురుకూడా నేర్చుకుని, విశ్వసించి జవాబు చెపితే ఏమంటాడు?

పదహారో రోజున అల్లుణ్ణి భూశయనం చేశారు.

అతనికి ఏమీ బాధ లేదు. నిండు స్పృహలో వున్నాడు. కాని నూనె ఆఖరైన దీపంవలె కుంకి పోతున్నాడు. ఇంకా ఒకచెయ్యి, మీదపడి యేడ్చే సుందరమ్మ మెడమీదనే వుంది. అందర్నీ పొమ్మని సౌంజ్ఞచేశాడు.

"యేడవకు, కాలగతికి మనమేం చెయ్యలేము. ఈ రెండేళ్ల స్వర్గం తరవాత చావంటే నాకు వ్యసనం లేదు. నిన్ను వొదలడమే నా విచారమల్లా. కాని నిన్ను వొదలను. నాచావు తరవాత కూడా నిన్నే అంటి పెట్టుకుని వుంటాను. ప్రతినిమిషం నీతోనే వుంటాను. నీ జన్మానికంతా నేనే నీభర్తని" అన్నాడు.

"నేనూ మీవెంటనే వొస్తున్నా!" అంది.

కాని అతను మాట్లాడలేదు. మామగార్ని పిలిచాడు.

"మీరు నాకొకటి వాగ్దత్తం చెయ్యాలి. నేను పోయినా దానిలో నివసించ బోతున్నాను. దాని అందాన్ని అమితంగా ప్రేమిస్తున్నాను. దాన్ని వికారం చెయ్యవొద్దు. చెయ్యనని ప్రమాణం చెయ్యండి. కనపడక పోయినా దానికి భర్త వుండనే ఉంటాడు" అని అత్తమామలచేత ప్రమాణం చేయించుకున్నాడు.

"మీ కూతుర్ని ఏ అఘాయిత్యం చెయ్యకుండా కాపాడండి. ఇదిగో, చావు సహజంగా వొస్తే రానీ, మనం కలుసుకుందాము. కాని బలవంతంగా ప్రాణం తీసుకున్నావా, నువ్వు నాకు అందవు. చచ్చిన నన్ను మళ్లీ హత్య చేసినట్టే."

భర్త పోయింతర్వాత సుందరమ్మని బతికించుకోడం చాలా కష్టమయింది. ఆర్నెల్లు పెద్దజబ్బు పడ్డది. అందులో స్పృహలేని జాడ్యం, నయమైన తర్వాత కూడా మాట్లాడదు, తిరగదు, తినదు. చీకట్లో ఓమూల కావిడిపెట్టెమీద కూచుంటుంది, ఇరవైనాలుగు గంటలూ. అక్కడే నిద్రవస్తే పడుకుంటుంది. లేచి కూచుని వుంటుంది. చీకట్లోనే ఎవరితోనో రహస్యంగా మాట్లాడుతుంది. తలుచుకు, తలుచుకు ఏడుస్తుంది. నాబోటి బంధువువాళ్ళు యింటికి వెడితే, ఒకమూల, సన్నగా, వొదిగి, తెల్లగా, పొడుగా, నల్లని పెద్దజుట్టు విరబోసుకుని, చీకట్లో కోల కళ్ళల్లో మెరిసే గుడ్లతో వెర్రిగా చూస్తూ, కనపడుతుంది. అంత చీకట్లో, అంత విచారంలో, ఎంత అందంగా వుందని! ఈ లోకానికి సంబంధించిన, కొవ్వూ, మాంసమూ కరిగిపోయి, ఆత్మకి సంబంధించిన మెరుగు శరీరంలోనూ, కాంతి కళ్ళలోనూ కనపడుతోం దనిపిస్తుంది. సౌందర్యాన్ని, ముఖ్యంగా కళ్లలో ప్రకాశించే ఆత్మ ముఖానికిచ్చే సౌందర్యాన్ని వొదలక వెర్రిపడే నేను ఆమెను చూసి, అక్కడే ఆ చీకట్లోనే ఆమెని చూస్తూ ఆరాధిస్తూ కూచోడానికి వీలవుతుందా? ఆ శరీరంలోకి, కొత్తబలాన్ని, ఆ కళ్ళలోకి కొత్త వుత్సాహాన్ని తెప్పించే మార్గమున్నదా? అని తపనపడ్డాను.

కొత్తలో శ్మశానానికి పోయి, తెల్లార్లూ బిగ్గరగా అతన్ని పిలుస్తూ యేడ్చేదట.

ఇట్లా మూడు సంవత్సరాలు గడిచింది. సుందరమ్మ యింకా ఆమూల అట్లానే కూచుని వుంది. వొళ్ళంతా పాలి పోయింది—కాని తేజస్సు ఒకరవ్వ చెడలేదు. గంభీరత యెక్కువయింది. తపశ్శాలినివలె తోస్తుంది. మాట్లాడదు, కదలదు.

## ౨

తండ్రి చచ్చిపోయినాడు. బతికి వున్నన్నాళ్ళూ అతని ఆస్తి సంగతి యెవరికీ తెలీదు. ఆయనకీ తెలీదేమో! ఆర్నెల్లల్లో అప్పులవాళ్లు అన్నీ వేలాలు వేశారు. ఇంట్లో చేరిన వితంతువులూ, బ్రహ్మచారులూ యెక్కడ వాళ్ళు అక్కడ సర్దుకున్నారు. సుందరమ్మనీ తల్లినీ యిల్లువిడిచి పొమ్మన్నారు. సుందరమ్మ భర్త ఆస్తివుంది. కాని దానికోసం యెవరి నడగాలో,

యెట్లా తెచ్చుకోవాలో తెలీదు. లోకమంటే యెరగరు. గూడుపోయిన పిట్టలవలె దిక్కులు చూస్తో కూచున్నారు. చివరికి బెజవాడలోవున్న సుందరమ్మ మేనమామ వెంకట్రామయ్యకి యీసంగతి తెలిసి, తల్లినీ కూతుర్నీ రమ్మని వుత్తరం వ్రాశాడు.

ఆయింటో చీకటి మూలనించి కదిలి బైటికి కాదు; ఆయిల్లే విడిచి, ఆ వూరే, యెరిగిన మనుషుల్నే విడిచి, తానెన్నడూ చూడని, లోకంలోకి, తల్లి తప్ప ఏసహాయమూ లేకుండా వెళ్ళాలంటే, సుందరమ్మకి చాలా భయం వేసింది. తను ఆడుకుని, జన్మ, అంతా తనకి శరణ్యంగా వుంటుం దనుకున్న యింటిని యితరులు ఆక్రమించుకుని, తమ పూజా స్థలాన్ని తాము యితర కులాల వాళ్లని అడుగన్నా పెట్టనీని పవిత్ర ప్రదేశాల్ని, యిష్టం వొచ్చినట్టు భక్తిలేకండా వుపయోగిస్తారు. తమని నమ్మి, ఆయింటి నాశ్రయించుకుని పూజలు పొందే దేవతలు పాపం యేమవుతారు? చివర వాటికూ, ఏదో అద్భుతమైన శిక్ష తటస్థిస్తుంది; ఎక్కడో ధనం దొరుకుతుంది. ఎవరో సహాయ పడతారు. ఇన్నాళ్ళు పూజలు పొందిన దేవతలు తమను యీ ఆపత్సమయంలో ఆదుకోరా అనే ధైర్యంతో యేమీ ఆలోచించలేదు — కాని ఆ దేవతలనే వాళ్ళు వున్నారో లేదో, యిన్నితరాలు వూరికే వుత్త అర్థం లేని శ్లోకాలకే, ఏమీ లేని ఊహలకే, ఆశక్తిలేని బొమ్మలకే పూజలు, ప్రార్థనలు, నైవేద్యాలు, ధనము, శక్తి, కాలము, అంతా, అవివేకులై, ధారపోశారా! ఆ దేవతలు వున్నా వాళ్లకి సుందరమ్మకు సహాయం చేసేశక్తి వుందో లేదో!... వాళ్ళకన్న బలవంతులైన దేవతలు, యీవంశం చేత పూజలు పొందనివాళ్లు, అపకారం సాగించారేమో!

ఇవన్నీ సుందరమ్మ ఆలోచించ లేదు. విశ్వాసానికి, సమన్వయం కుదర్చాలని ప్రయత్నం చేసేనా వూహ లేగాని!

తనకర్మ యిట్లా వుంటే, దేవత లేం చేస్తా రనుకుంది. ఆ యొక్క ఆలోచనతో, ఆమెకి మనుషులమీద గాని, దేవతలమీద గాని, యేద్వేషమూ, నిరాశా, తోచనేలేదు. కన్నీళ్ళతో ప్రతిగది నించీ, దొడ్లో చెట్టునించీ, దేవతల ఆసనాస్థలాల నించీ శెలవ తీసుకుంది. సామాను సర్దాలి. సుందరమ్మ తన విచారాన్ని మరిచి తిరగాలి, ఆమెకి కాళ్ళనూ. చేతుల్నీ, కదిల్చే బలవాశ్లే పోయినాయి. కళ్ళు కూడా కాంతిని భరించలేవు. ఆమె బైటికి

వొచ్చిందంటే, చూడడానికని, వూరంతా మూగారు.

అధికార ఐశ్వర్య పదచ్యుతి పొందిన మనుషులమీద లోకానికి వున్న కోపం యెవరి మీదా వుండదు. తమస్థానాన్ని నిలబెట్టుకో లేని వాళ్ళు, తమ కన్న అధికులమని ఇన్నాళ్ళు తమని మోసం చేశారే అనుకుంటారు. ఔన్నత్యంలో వున్నన్నాళ్ళు, ఆ మనుషులే, వాళ్ళ స్వభావంలోనే ఔన్నత్యం వుందనుకుంటారు. అధికారమూ, ధనమూ, 'ఛాన్సు' వల్లగాని, అదృష్టం వల్లగాని తటస్థించిన విషయాలను కోసు. కాని పతనం కలగ్గానే, వాళ్ళు గూడా తమవంటి సామాన్యులేనని తెలుసుకుని మండిపడతారు. ముఖ్యంగా అందులో, ఆ దీనత్వంలో కూడా అహంకారాన్ని పూని, తమ వద్ద ఆశ్రయించని ధీరుల్ని చూస్తే, ఉగ్రత్వాన్ని తలుస్తుంది లోకం—పాపం! అని పెదవులతో అని, చాటుగా ఒక్కరాయి విసురుతుంది.

కాని లోకంతో సంబంధం మానివేసుకున్న సుందరమ్మకి ఇవేమీ కనపళ్ళేదు. ఆగుంపు వంక తలన్నా యెత్తలేదు. కాని ఆమెతల్లి గుంపులో వాళ్ళని తిడుతోంది.

సామాను సర్దాలంటే, తల్లి ఏమీ వొదలక అన్ని మూటలు కడుతోంది, గోళ్ళు, బోషాణం వడ్లబస్తాలు అన్నీ. సుందరమ్మకి కూడా ఏమీ తెలీదు. బళ్ళవాళ్ళు వొచ్చారు. సహాయానికై పొరుగువాళ్ళు వొచ్చారు. వాళ్ళని యింట్లోకి రానీదు, బ్రాహ్మలు కావాలంటుంది తల్లి.

"రేపణ్ణించి యెవరు తిరుగుతారో! వాళ్ళనిరానీ" అంది సుందరమ్మ— కాని లాభం లేదు.

చివరికి కరణంవొచ్చి, ఆసామానులన్నీ తీసికెళ్ళడానికి వీలులేదనీ, రైలు ఛార్జీ, బెజవాడలో యింట్లో సలవూ, ఇవన్నీ మాట్లాడి వొప్పించాడు ఆమెని. దేవతలూ, దేవతార్చన సామాన్లూ, ఎవరినీ తాకనీ లేదు. వూరగాయ జాడీలో! అన్నీ ఒక బ్రాహ్మణ్ణి పిలిచి దానం చేశారు. పదేళ్ళ కింద పెట్టిన వూరగాయలు కూడా వున్నాయి.

సుందరమ్మా తల్లీ కలిసి దేవతల్ని బండిలో యెక్కించారు. వీళ్ళు సరిగా బెజవాడ చేరతారా అని అనుమానంగా వుంది వూరివాళ్ళకి.

రైలులో యెక్కగానే ఓకారా పెట్టింది సుందరమ్మకి. ఆపెట్టెలో వాసనే ఘోరమనిపించింది, నిర్మలమైన గాలి అలవాటైన ఆమె ముక్కుకి. ఇంతలో

ఒక ఆమె చుట్టు వెలిగించింది. కొంతసేపటికి ఒకామె లేవటంకీ, తలుపు తెరిచింది.

"ఇంకెంతసేపు ఉండాలి అమ్మా, యీ నరకంలో మనము ?"

"ఓగంట ఉండాలేమో !"

"ఎందుకూ ఆమనిషి లోపలికి వెళ్ళింది ?"

"అది పాయిఖానా దొడ్డి."

ఆమనిషి వొచ్చింది—

"మరి కాళ్ళు కడుక్కోడేం? చేతులు కడుక్కోడేం? "

వాళ్ళ వూళ్ళో స్నానం చెయ్యడం మామూలు.

"నీళ్లేవి యిక్కడ ?"

"మరి — — ?"

"మాట్లాడకు, అది వింటోంది."

మాటలు వినాలని ఆ సాలెమనిషి యింకా దగ్గిరికి వొచ్చింది.

"కొంచెం దూరంగా కూచో. అట్లా దగ్గిరికి వొస్తావేం?" అంది తల్లి.

"ఏం ఆచోటు చాలదూ నీకు? ఇదంతా నువ్వే కొనుక్కున్నావా?"

తక్కువజాతి స్త్రీ అట్లా మాట్లాడడమే! సుందరమ్మ రక్తం వేడెక్కింది. స్వభావంలోనే వున్న అధికారగర్వం ఆగక పోట్లాడింది.

పక్క స్టేషన్లో ఇంకో ఆమె యెక్కి వీళ్ళ ముందుగా వెళుతోంది.

అదృష్టంలో తమకు సమానమైనా, వంశంవల్ల అధికులమని సూచించే ఆ బ్రాహ్మల్ని క్షమించ తలుచుకోలేదు ఆ సాలెమనిషి.

"అట్లా వెళ్ళకండమ్మా! వారు ఆబెంచీనంతా కొనుక్కున్నారుట !"

"కొనుక్కోడమేమిటి?" అని వాళ్ళపక్కనే చతికిలపడ్డది.

"ఎక్కడనించి, మరియమ్మా! నువ్వు!"

"ఈ వూళ్లో కాన్పుచేసి వొస్తున్నానమ్మా !"

"ఎవరే నువ్వు!" అంది తల్లి.

"ఎవరే ఏమిటి? ఏంగొప్ప !"

"మరి కానుపుచేసి, స్నానంచేశావా ?"

"స్నానం? అదంతా మీ బ్రాహ్మలు! కిరస్తానీలం మాకా పిచ్చిలేదు."

"ఛీ, ఛీ. కిరస్తానివా? దీంట్లో యెక్కావేం? ఆ మూలకూచో."

నివ్వెరపోయి చూసింది మరియమ్మ.

పెట్టెలో వాళ్ళంతా ఆశ్చర్యంతో వేళాకోళంగా చూస్తున్నారు.

"ఈమూట యెందుకూ, పైన పెట్టండమ్మా!" అంటూ తియ్యపోయింది.

"తాకకు, తాకకు."

"మరితియ్యి!"

"ఎక్కడ పెట్టను ?"

"కింద పెట్టు."

"వుమ్మలు — అవి మా దేవతలు."

"దేవతలు — దేవతలు! మట్టిబొమ్మలా ? కొయ్య బొమ్మలా? నీ దేవుళ్లూ నువ్వూను ? పెంటలో పారెయ్యి."

అని మూటని లాగింది. సుందరమ్మ సహించలేక పోయింది. పెదిమ వొణికింది. తన దేవతల్ని, వందలకొలది యేళ్ళనించి పూజించిన సుందర విగ్రహాలని—కంఠం వొణికింది కళ్ళలో నీళ్ళు కమ్మాయి. నుంచుని చెయ్యి జాచి—

"నువ్వు, నువ్వు...మాలదానివి....నీచురాలివి...అంటుదానివి...మా దేవతల్ని...తాకుతావా ? తాకి బతుకుతావా ? నీతల చెక్కలుగాదా ! జాగ్రత్త!" అని గంభీరంగా పలికి, వొణికి కూలబడి కళ్ళుమూసుకుంది. మరియమ్మ పక్కున నవ్వింది. కాని బండిలో వాళ్ళంతా ఆమె ఆవేశము, ఆమె సౌందర్యము, ఆ వాక్యాలలోని వాస్తవమైన ధ్వని విని ఆశ్చర్యపడి చూశారు—

మరి ఆదేవతలే వున్నారో, లేక సహజశక్తులే కరుణించాయో, లేక "ఛాన్సు" తటస్థపడ్డదో, పైటికి చూస్తున్న మరియమ్మ తలమీద కిటికీ చెక్క జారిపడ్డది. గాయమై రక్తం కారింది.

బ్రాహ్మణ ద్వేషంతో పరమతపక్షానికి వొప్పు చెప్పిన హిందూ హృదయాలన్నీ సుందరమ్మ పాదాక్రాంతాలైనాయి.

"చూశారమ్మా, దేవతల మహిమ!" అని అట్లా జరిగిన నిదర్శనపు కథలు చెప్పుకోడం మొదలుపెట్టారు. కాని ఒక్కరూ మరియమ్మకు సహాయం చేసినవాళ్ళు లేరు.

తెనాలి స్టేషన్‌లో "దిగండి, దిగండి" అని అరుస్తున్నారు. అందరూ

దిగారు. తల్లీ సుందరమ్మా యింకా సామాన్లు దింపుకుంటున్నారు.

“ఇంకా యేమిటి దింపుతున్నావూ? బండి వెనక్కి కదులుతోంది. ఏ పిల్లా! దిగు దిగు!”

“ఇంకో మూట వుంది. అమ్మాయి వెళ్ళవే.”

సుందరమ్మ తలుపుదగ్గరకి వొచ్చేప్పటికే రైలు కదిలింది. “జాగ్రత్త” అంటూ ఆయన జబ్బ పట్టుకో పోయినాడు. తప్పించుకు దూకింది. తాను వెల్లకిత్తలా బడ్డది. మూట రైలు సందున పడ్డది. మూట యెత్తి యివ్వడం బదులు, తిడతన్నాడు ఆయన. లేచినుంచుని ఆయనవంక చూచింది కోపంగా. చప్పున గొంతు తగ్గించి, పోయినాడు ఆయన. బాగా దెబ్బతగిలింది. కళ్ళంబడి నీళ్ళు తిరుగుతున్నాయి. తల్లికి చెప్పలేదు. ఆమె దేవతలమూట మొయ్యలేక సుందరమ్మ బుజాన పెట్టింది. ప్రపంచాలన్నీ మోసే దేవతలు, సుందరమ్మ బుజానికి భారమైనారు.

ఇదేమి లోకమా, నిజమా, కలా, అని చూస్తూ నుంచుంది.

“ఎక్కడికి?”

“బెజవాడ?”

“వెళ్ళరేం? రైలుపోతోంది.”

“ఎక్కడా? నాయనా, యీనాలుగు మూటలు తీసుకురా!”

“నేనా?” అంటూ పోయినాడు, సుందరమ్మ వంక ఆమె సిగ్గుపడేటు చూస్తూ.

ఎవరూ సహాయం చెయ్యరేం? వూరికే నే తిరుగుతున్నారు చాలామంది! ఉపకారం కనపడటం లేదూ?

బెజవాడ రైల్లో మొగవాళ్ళ పెట్టెలో యెక్కారు. వితంతు వివాహం చేసుకున్న ఆయన చిటుసపడ్డాడు. తలవెండ్రుకలున్న వితంతువుని చూసేప్పటికి, అతని మనసు తహతహలాడి పోయ్యింది. ఎదురుగా కూచుని ఓ అంటుజోళ్ళ ఆయన, పనిలేక వాళ్ళని ప్రశ్నలడుగుతున్నాడు. వూరు, పేరు, గోత్రం, ఆ తర్వాత యింటిపేరు, తాత పేరు—ఎదటవాళ్ళ విషయం గురించి తెలుసుకోటం—మొదలు. ఆ ప్రశ్నలకు తల్లి మెల్లిగా జవాబు చెపుతోవుంటే, వాళ్ళ సామానులన్నీ పెట్టెలో పారేస్తే యెటూవుంటుందో అట్లావుంది సుందరమ్మకి. చెప్పకపోతే, కోపమొస్తుంది. వెక్కిరిస్తారు. బ్రాహ్మణులూడా చేరారు.

"అమ్మాయికి వైధవ్యమొచ్చి యెన్నేళ్ళు ?"

"పిల్లలా ?"

"నగలు వున్నాయా ?"

"అత్తవారి వూరు ?" ఇట్లా అడిగి అడిగి ఒక్క నిమిషం సందేహించి,

"అమ్మాయి యవ్వనమంతా వృధాగా పోతోంది" అని పెద్దనిట్టూర్పు విడిచాడు. కలవర పడుతున్న సుందరమ్మ ముఖం చూసి పక్కన వున్న చాదస్తుడు అందుకున్నాడు.

"ఆ యవ్వనం పురుషుడికి వుపయోగార్థమా ?"

"కాదా?"

"ఏమీ, దేవతల కర్పణంగా కూడదా ?"

"దేవత లేమిటి? పాపం ఆ అమ్మాయి బాధ మీ కేం తెలుసు ?"

సుందరమ్మకి తనను చీరె విప్పి నుంచోపెట్టి నట్టయింది.

"అమ్మాయీ, నీకు చక్కని పెనిమిటిని తీసుకొస్తాను చూడూ."

"మే మట్లాంటి వాళ్ళం కామండి" అంది తల్లి. కోప మొచ్చింది ఆయనకి,

"అట్లాంటివారమంటే, మేమేం చెడిపోయినవాళ్ళమా ?"

"ఏమో లెండి, మీ సంగతి మా కెందుకు ?"

"ఈనాడు మీకు తెలీదు. చివరికి మీరే విచారిస్తారు, నామాట విన లేదని! మీ వుద్దేశ్య మేమిటి! పునర్వివాహం పాపమనా ? ఎందుకు పాపము ? మొగవాడు పెళ్ళి చేసుకుంటేనో—"

అంటో మామూలు కారణాలు మొదలుపెట్టాడు. వితంతూ వివాహం, పాపం కానీ కాక పోనీ, పుటకవల్ల, అలవాట్లవల్ల, సాంప్రదాయం వల్ల పునర్వివాహాన్ని ఏవగించుకునే వాళ్ళు వున్నారని, భావన చేసుకోలేదు. స్పష్టంగా తెలిసే యీ మాత్రపు సంస్కారణాన్ని అర్థం చేసుకోలేరేమా అనుకుంటాడు. మూఢదేశమని తిడతాడు. కాని తన కులాభిమానమూ, శాకాహార నియమమూ, శివార్చనా, అన్నీ కూడా హేతువాదానికి నిల బడవని అతను పరీక్షించుకోలేడు. వృధాపొయ్యే ఆమె యవ్వనం మీద దయేగాని, అటువంటి భావమే లేని ఆమె మనసులో తాను కదిలిస్తున్న వికారాల్ని గురించి తలుచుకోడు. ఆ సౌందర్యం ఏ పురుషుడి కళ్ళనో ఆనంద పరిస్తేనే కాని నిష్ప్రయోజన మనుకోడం న్యాయమో కాదో

యోచించలేదు.

అదృష్టవశాత్తూ బెజవాడ వచ్చింది. ఆమె యవ్వనాన్ని గురించి వ్యసన పడ్డ మనిషి సుందరమ్మ మూడు మూటలు మోసుకు పోతో వుంటే చూసి, ఆ లేత ఎమికలు పడేబాధను గుర్తించక, తన బావమరిదితో నవ్వుతో వెళ్ళిపోయినాడు. షికారుగా వొచ్చిన సోమయాజులు అనే కుర్రాడు చూశాడు. సుందరమ్మని చూడగానే ఆ స్టేషనులో చప్పున దీపాలు ముట్టించినట్లు, మిగుమిట్లు గొలిపాయి అతని కళ్ళు. శుష్కించిన చేతులతో ఆ మూటలు పట్టుకుని, వొంగి బాధ భరించలేక కళ్ళలో నీళ్ళు కుక్కుకునే ఆ పిల్లని చూసి: "నేను తెస్తాను" అన్నాడు ఓడియంగా.

"బ్రాహ్మలా?"

"అవును."

ఇచ్చింది. బండిదాకా తెచ్చాడు. సామానులు బండిలో పెట్టారు. ఒక్క మాట మాట్లాడకుండా; తిరిగి చూడకుండా సుందరమ్మ బండిలోయెక్కింది.

అట్లా ఆ బండికేసి చూస్తో, అర్థంకాని బాధని, అనురాగాన్ని, లోపల అణుచుకొంటో, నుంచున్నాడు సోమయాజులు. కొందరు స్త్రీలు (పురుషులుకూడా) ఏదో తెలీనివి, ఎన్నడో మరిచిపోయినవి, కొంచెంగా స్ఫురణకు వచ్చి బాధ పెట్టేవి, ఏవో సంబంధాలను, అందాలను తోపించి, మరపురాని, బాధను కలిగిస్తారు. పాపం సోమయాజులు ఆమె రూపాన్ని వొదలలేక వొదలలేక, దృష్టిని మరల్చాడు. కాని "నీ బాధ ఎట్లాపోతుంది? నీ వుద్దేశ్యం ఏమిటంటే?" చెప్పలేదు. టాజ్ మహల్ని, హిమాలయ శిఖరాల్ని, పండువెన్నెల రాత్రిని చూస్తే కలిగే బాధకూడా అంతేకదా!

సుందరమ్మ మనసులో సోమయాజుల్లేడు. ఎక్కడికి? ఏ యిల్లు? ఎవరుంటారు? తనని ఆదరిస్తారా! ఏ కష్టాలు ప్రాప్తిస్తాయో! తన గతి యేమవుతుందో! అనుకుంటోంది.

జీవితం ఆ మూల రక్షణలోనున్న శిష్టాచారపరురాల్ని, సుందరమ్మని, మోసగాళ్ళు, క్రూరులు, నీచులు, ఆచారరహితులు, నూతన విద్యాపండితులు, ధనాన్వేషాపరులువుండే యీ క్లిష్టమైన లోకంమధ్య పారేసింది, ఏమాత్రమూ కరుణలేకుండా, తామరపువ్వును ముళ్ళకంచలమధ్య పెద్దగాలి పడవేసినట్లు.

# 3

వెంకట్రామయ్య పూర్తిగా పట్టణ వాసాని కలవాటుపడ్డ బ్రాహ్మణుడు. ఆచారాల్ని కాలానుగుణ్యంగా మార్చుకునే బాధలన్నీ ఆయన తండ్రి కాలంలోనే జరిగిపోయినాయి. కొన్ని పనులు బ్రాహ్మణులు చెయ్యకూడని పనులని 'స్ఫురణకి రావడంకూడా మానేసింది ఆయింట్లో వాళ్ళకి. దిక్కులేక వాళ్ళయింట్లో చేరిన పల్లెటూరి సుందరమ్మకీ, తల్లికీ యేదో కొత్త విచిత్రలోకానికి వొచ్చినట్టుంది! కంచాలలో తినడమూ, మైలబట్టలతో పీటలమీద కూచోడమూ, స్వంతంగా క్షవరం చేసుకోడమూ, చాకలి తోడిన నీళ్ళ స్నానం చెయ్యడమూ చూసి, విభ్రాంతులైనారు. తల్లి వెంటనే, అన్నమే మాని, స్వయంగా రొట్టె కాల్చుకుని ఒకమూల తింటోంది. కాని, సుందరమ్మకి కర్మక్షీణం తప్పలేదు. మొదట్లో 'ప్రొటెస్టు' చెయ్యాలనిపించింది. కాని కొత్తయిల్లు, యెరగని మనుషులు, హక్కు లేదు, దిక్కు లేదు, వూరుకున్నది.

కాని 'నెసెసిటీ', ప్రాణాలు నిలుపుకోవలసిన ఆవశ్యకత, కొత్త లోకాన్ని చూసి భయం, ఇవన్నీ యీ దేశాన్నంతా యెట్లా బలవంతంగా మార్చివేశాయో, అట్లానే సుందరమ్మనీ మార్చాయి. ఈ యిద్దర్నీ వెంకట్రామయ్యగారి కుటుంబం ఎంతో ఆదరించింది, ప్రేమ చూపింది, వాళ్ళు రావడమే ఘనతగా ఎంచింది. కాని నీళ్ళకోసం వాళ్ళ ఆచారాలను రవ్వంత కూడా మార్చుకునేట్టు లేదు; లోకం తల్లకిందులైనా, ఆఫీసువేళకి భోజనం తయారు కావాలి. ఆయన సౌఖ్యమనే సూత్రం మీద ఈ సంసార చక్రం తిరుగుతోంది. ఏమార్పు కావాలన్నా ఆయనకీ ఆయన సుఖానికీ 'రిఫర్' చేస్తారు. ఆయనతో చనువుగా మాట్లాడ్డానికి, ఆయన భార్యకీ, కూతురుకే, గుండెలు లేవు. ఆయన ఆఫీసు లోకంలో, యీ ఆచారాలు, సెంటిమెంట్లు, పరిచయాలు, వ్యక్తిత్వాలు, వీటికి వేటికీ ప్రవేశం లేదు.

సుందరమ్మ ఆచారమంతా అలవాటే గాని, ఒక్కటీ ప్రిన్సిపుల్ కాదు. కనక కొత్త వాతావరణంలో చాలా తొందరగా 'ఎడ్జస్టు' అయిపోయింది. కాఫీ కూడా తాగింది. జుట్టు కూడా దువ్వుతుంది. చీరెలు లేనప్పుడు ఆయనకూతురు చీరెలుకూడా కట్టుకుంది. అంత ప్రేమతో

యిస్తే యెట్లా నిరాకరిస్తుంది ?

కూతురికి పదేళ్ళు. ఆమెకి చదువు చెప్పడానికని ఒక బీద ట్రెయినింగు విద్యార్థి చంద్రశేఖరాన్ని తన యింట్లోనే వుంచుకుని భోజనం పెడుతున్నాడు. అతను సంగీత విద్యార్థికూడాను. అందుకని ఆ పిల్లకి, సంగీతంకూడా చెపుతున్నాడు. వెంకట్రామయ్యగారు సుందరమ్మని కూడా పాఠాల దగ్గర కూచోమన్నారు. తరవాతి తరవాత సుందరమ్మకీ యిష్టం కలిగింది.

"కమల సులోచన...మరాళీ గామిని...కరిహర మధ్యే...కస్తురి కుంకుమ సంకలితే—" అని పాడుతోవుంటే, ఆమెకు చిన్నతనమూ, దేవీ పూజా, సహస్రనామార్చనా, కుంకుమపూజా, హారతులూ, జ్ఞాపకం వొస్తాయి.

"కచకుచధర సుమమాలా, కర సరసిజ పరిపాల సూనృతవర శుభగాత్రీ... కళ్యాణీ" అని పాడుతోవుంటే శరీరం పులకరించేది. ప్రతిదినమూ తన దగ్గరిగా కూచుని పాట వింట్లో, విశాల నిర్మల నేత్రాలను అంతర్ముఖం చేసి, ఆనందం ముఖాన వెలుగుతో వినే ఆ మంగళ విగ్రహాన్ని చూసి, ఆ తేజస్సులో కొంత మొదట తన పాటవల్లననీ, తరవాత తనవల్లనే ననీ, మోసపొయ్యే, ఆ యవ్వనుడి విభ్రాంతిని ఆమె గ్రహించనే లేదు.

అనుభవమూ, రసజ్ఞతా లేని, ఆ యువకుడు తన బాధను మింగుకుని, మింగుకుని, ఆమే తనకు ఏదో విధంగా తెలియ చేస్తుందని ఆశ పడి, పడి, యింటినంతా పువ్వులతో నింపుతున్నట్టు తిరిగే ఆమె శుభ శృంగారాన్ని భరించలేక, యవ్వనులకు సహజంగా తోచే, మార్గాలను వుపయోగించడం ప్రారంభించాడు. మెల్లిగా సంగీత పాఠాలుకూడా స్వరజతుల్ని చేరుకున్నాయి.

"కరివరదా, మరిమరి నా అధరము గ్రోలర"

నేర్చుకునే శిష్యురాలి ధ్యాస తాళం మీదా స్వరంమీదా, వినే సుందరమ్మకి ఆ వాక్యంలో మొదటిభాగంమీదా, నేర్పే గురువుకి రెండో భాగం మీదా వుండేది ధ్యాస. "నీదు స్మరణగాక వేరే యెరుగను" అని ఆమెవంక చూస్తాడు. ఆమె ఇంకో అర్థంలో ఆ మాటలనే తలుచుకొంటూ ఎక్కడో చూస్తుంది.

మొదటినించీ పరాధీనుడూ, ఇతర్ల దయలో మెలగవలసిన వాడు కావడం చాత, అతనికి ధైర్యమే నశించింది. తన పాటలతో ఆమె హృదయం మే

కొని, తనవేపు తిరుగుతుందని అతని ఆశ. కాని ఆమె తనయెడల వాంఛ చూపకపోతే, కలలోనన్నా ఆమెకి తనకోర్కె తెలప లేదు. ఆమె మనసులో ఏమి జరుగుతోందో కనిపెట్టే తెలివిలేదు.

"నిన్న మొదలు నిదురలేదే చెలి" అన్నా, చివరికి "తొడలు, తొడలు" అని పాడినా లాభంలేక పోయింది. ఆమె కొంచెం సిగ్గుపడడమో, కోప పడడమో, కనపడ్డా అతనికి ఆశ వుండును. ఆభాష ఆ పిల్లకి ఎంత అర్థమవు తుందో సుందరమ్మకీ అంతే అర్థ మవుతోంది. భర్త చితిమీదనే ఆమె శృంగార భావంకూడా తగలపెట్టి వొచ్చినట్టుంది.

కాచుకుని వుండగా వుండగా అతని అదృష్టంవల్ల అతనికి చక్కని సమయం లభించింది. ఆ దుర్గమ దుర్గంలో ఒక్క మూల ప్రవేశ మార్గం లభించింది. ఆమె నిర్మల హృదయపద్మంలో అతి మృదువైన దళం అతని కందింది. ఆమె స్వభావంలో వున్న ఒక్క మెత్తని స్థలంమీద తలవని తలంపుగా అతని వేలుపడ్డది.

అతనికి జ్వరం రావడం కారణం. కష్టాలు కూడా జీవితంలో యిట్లానే వుపకారానికి కారణాలవుతాయి. దూరదృష్టితో చూస్తే చివరికి అపకారమే పర్యవసాన మవుతుందేమో! ఇతరులమీద ఆధారపడే సమాజంలో చంద్ర శేఖరం, సుందరమ్మా, సఖులు కావడంచాత సహజంగా పరస్పర సానుభూతి వుంటుంది. అతనికి అప్పుడప్పుడు సుందరమ్మ జావా, మందూ యిస్తోంది. గిన్నె అందిచ్చేప్పుడన్నా ఆమె వేలు తగులుతుందేమోనని ఆశపడతాడు. కొంచెం ఆగి రెండుమాటలు మాట్లాడకూడదా? ఆమె నిలుచున్న నాలుగు నిమిషాలూ, అతనికి గొప్ప ఐశ్వర్యం పట్టినట్టుంటుంది. తాగడం ఆలిస్యం చేస్తాడు. ఒకనాడు జావతాగి పెద్దమూలుగు మూలిగాడు.

"ఏమి ?"

మాట్లాడడు.

"నెప్పా ?"

మాట్లాడడు.

"నయంలేదా ?"

"ఎప్పటికీ నయం కాదు!"

"ఎందుకు అట్లా అనుకుంటావు ? వుత్త జరానికి ?"

"నాకు కుదరదు."

"కుదురుతుంది. విచారపడకు." అని వెళ్లిపోయింది. పనిలేకండా పడుకుంటే అదే ఆలోచన. జ్వరంలోకూడా తాపజ్వరం విడవలేదు. ఎన్నో ప్లానులు వేసుకుంటాడు. ఆమె రాగానే భయం వేస్తుంది. మళ్ళీ ఆమె అసాధారణ తేజం చూస్తే విభ్రమం కలుగుతుంది. ఆమెని చూస్తో చెయ్యాలనుకున్న వన్నీ మరిచిపోయి, నోరు తడబడి వూరుకుంటాడు. ఒకసారి ఆమెని చూడగానే అతని ఆలోచన లేకండానే కళ్ళనీళ్ళు కారాయి. ఆమె జాలిపడ్డది.

"మీవాళ్లెవరూ లేరా ?"

"వున్నారు. వాళ్ళకి నేనక్కర్లేదు."

"పిలిపించమని చెప్పనా ?"

"వొద్దు."

"మరి దిగులుపడతా వెందుకు ?" అని వెళ్ళిపోయింది.

కోపమొచ్చింది అతనికి. సాధారణమైన జాలికూడా లేదే అమనిషికి ! కాని కొంచెం జాలిచూపితే దాని 'ఎడ్వాన్టేజ్' తీసుకుని, దాన్ని ప్రేమగా భావించి పీడించిన పూర్వ పురుషుల దౌర్జన్యంనించి బాధపడ్డ స్త్రీల రక్తం ఆమెలో ప్రవేశించి సహజ ముగ్ధత్వాన్ని ప్రసాదించలేదా మరి ? రాత్రి సుందరమ్మ జావ తెచ్చినప్పుడు, అక్కర్లేదన్నాడు. ఆమె కొంచెం బతిమాలింది.

"నా కాకలిలేదు. సయించదు. నేనిక బతకను." ఆమె సహజమైన దూరత్వాన్ని మరిచింది. మాతృత్వం విజృంభించింది. అతి దయతో "నా కోసం తాగు" అంది జాలిపడి. పాపం, వొంటరి బ్రతుకు, ఎంత దిగులుపడి పోయినాడో అన్న భావమే ఆక్రమించింది ఆమె మనసుని.

"నీకోసమా ? ఐతే తాగుతాను. నిజంగా నేను తాగాలనే వుంటే, కొంచెం యిట్లా వీపుమీద చెయ్యివెయ్యి. వికారంగా వుంది." అన్నాడు.

ఎక్కడో తప్ప సాధారణంగా పురుషుడు వొచ్చి తన చూపులతో, మేల్కొలిపితేనే గాని మొదటిసారి స్త్రీత్వం నిద్రలేవదు. అందులో సుందరమ్మవంటి పూర్వాచారపరులకు, శిష్టశిక్షణులకు, ఆరోగ్య వంతులకు, పురుషుడు వొదలగానే, మళ్ళీ కునికిపాట్లు పడుతుంది కామోద్రేకం. భర్తతో,

భర్తృపూజలో, భక్తితో, మిళితమైన స్త్రీకి భర్త కనపడితేనేగాని, మనో వికారం కలగదు. తక్కినవారియెడల లింగభేదమే తోచదు. పురుషుణ్ణి చూసి కలవరపడి, సిగ్గుపడి, యెడంగా పోయే ప్రతి స్త్రీ హృదయంలోనూ, వ్యభిచారం దాక్కునే వుంది.

"వెర్రివాడా, యింతేనా ? పాపం, జబ్బులో దగ్గిరకూచునే వాళ్లెవరూ లేరా ? ఆమాట చెప్పవేం ?"

కామవికారంలేని స్త్రీకి, పురుషుడి మనసులో తనమీద కోర్కెవున్నట్టు, తెలుసుకోడం చాలాకష్టం. ఆతని మోహసంజ్ఞలన్నీ గుర్తుపట్టగల పూర్వ జ్ఞానమే వుండదు ఆమె మనసులో! కాని యీనాడు, పురుషుడి సాధారణ వాక్యాలూ, మామూలు చూపులూ కూడా అపార్థాలతో స్ఫురిస్తున్నాయి నాగరికతగల పతివ్రతలకు.

ఆమె మాటలు విని సంతోషించాలో, విచారించాలో తెలీలేదు ఆతనికి. ఆతనిమీద చెయ్యివేసి పట్టుకుంది.

"నామీద చెయ్యివేసిన సంగతి ఎవరితో చెప్పకేం ?"

"ఏమి ?"

"బాబుగారికి తెలుస్తుంది."

"తెలిస్తే ?"

"తప్పు అర్థం చేసుకుంటారు."

"ఛా !"— ఇంకా అర్థంకాలేదు, అమాయకురాలికి !

"వొద్దు. నామీద వొట్టే."

"సరేలే."

మర్నాడు రాత్రి సుందరమ్మ కన్న ముందు, ఆతని శిష్యురాలు మందు తీసుకొచ్చి యిచ్చింది. మందు వొద్దన్నాడు. కారణమడిగితే వికార మన్నాడు. సుందరమ్మ జావ తీసుకొచ్చింది.

"జావకూడా నువ్వు తీసుకురా వనుకున్నాను."

"ఏమి ?"

"మందు యివ్వలేదుగా ?"

"ఎవరిస్తే నేమి ?"

"ఒకటి ఎట్లా అవుతుంది ?"

“వెఱ్ఱివాడా, నువ్విట్లా పంతాలుపడితే, యెట్లా బతుకుతావు ?”

ఆజాలి మాటలతో అతని విచారమూ, నిరాశా అన్నీ పొర్లి వొచ్చాయి.

“నువ్వు లేనిది బతకలేను. నువ్వే నా జీవనాధారం. నీమీద ఆశతోనే బతుకుతున్నాను. నన్ను చంపు. కొయ్యి, అనేశాను ఇంకేమైనా సరే.”

అని ఆమె కాళ్ళమీద పడ్డాడు. అంత జ్వరంలో కాకపోతే, ఆమాటలనడానికి ఎన్నేళ్లయినా అతనికి ధైర్యం వొచ్చేదికాదు.

చప్పున కళ్ళమీద పొర తొలిగినట్టయింది. ఆమె కరమవుతోంది. కళ్లు తిరిగాయి. భయమేసింది. కాళ్లు వొదిలించుకుని దూరంగా పోయింది.

“నేనేమిటి ? నేనేమిటి ? అంటో లోపలికి వెళ్లింది. అతనికి రూఢి యేర్పడ్డది, ఇంక లాభంలేదని. తప్పకండా వెంకట్రామయ్యగారితో చెప్తుంది. ఆయన హెడ్మాష్టరుగారితో చెపుతాడు. డిస్మిస్ చేస్తాడు. ‘సెయిఫెండు’ ముదరాయిమ్మంటారు! ఎక్కణ్ణించి తీసుకొస్తాడు? ఆ బెంగతో మోహమూ జ్వరమూకూడా మాయమైనాయి. ఆ వొక్క బెంగే పని చేస్తోంది. ఆమెని బతిమాలుకుని ఎవరితోనూ చెప్పకండా చెయ్యాలి.

రాత్రి పదిగంట లయింది. తల్లి వంటిల్లు కడుగుతోంది. సుందరమ్మ దొడ్లో బాదంచెట్టుకింద కూచుని ఆలోచించుకుంటోంది. ఆమె భయమూ, ఆశ్చర్యమూ, కోపంగా అసహ్యంగా మారుతున్నాయి. ఏమిటి వాడి ధైర్యం? తనని, తనవంటిదాన్ని, ఆ పవిత్ర వంశస్తురాల్ని, ఆ పండితుడి భార్యని, ఏమన్నాడు ? ఏమనుకున్నాడు ? ఆమె అభిప్రాయంలో చాలా నీచస్త్రీలు మాత్రమే అట్లాంటి పనులు చేస్తారు. అంత నీచ స్త్రీ కిందకట్టాడు తనని. ఇంక తన బతుకెందుకు ? ఛీ, నీచుడు. బుద్ధిహీనుడు. వాడివంక చూడ కూడదు. వాడితో మాట్లాడ కూడదు.

“చూడు.”

చంద్రశేఖరం తూలుతో వొస్తున్నాడు. హడలిపోయి, యిదేమిటో యీ దెయ్యమిట్లా పట్టిందన్నట్టు, ఒక్కమాట లేకండా యింటోకి పోతోంది.

“ఒక్కమాట. ఈమాట ఆఖరిమాట. నన్ను క్షమించాలి.”

ఆమె గుమ్మం దగ్గిర ఆగింది.

“ఇందాక నేనన్నమాట లన్నీ అబద్ధం. వూరికే అన్నాను.”

“సరేలే !”

"నువ్వెటువంటి దానివో పరీక్షించడానికి అన్నాను."

లోకంలో తనకి ముందు వేలకువేలు పిరికి ప్రేమికులు యీ మాటలే అన్నారని అతనికి తెలీదు.

"నమ్ముతున్నావా ?"

ఆమెకు మరీ అసహ్యం యెక్కువయింది. "సరేలే. వెళ్ళు:"

"ఎవరితోనన్నా చెపుతావా ?"

"నాకేం పని ?" అని వెళ్ళిపోయింది.

. నాలుగురోజులు సుందరమ్మ అతనివేపు వెళ్ళలేదు. అతనికి భయ మెక్కువయింది. చెప్పిందేమో నని ఇంటోంచి పారిపోదా మనుకున్నాడు. కాని లేవలేక పోయినాడు. ముసుకుపెట్టుకుని పడుకున్నాడు. ఆదుర్దా పడి డాక్టర్ని పిలిచారు. డాక్టరు జ్వరంలేదు, పెంకెతనం లాగావుంది అన్నాడు. పరాధీనుల్ని చూస్తే డాక్టర్లకికూడా చులకనే కదా అనుకున్నాడు చంద్రశేఖరం. తిండిలేక పోవడంతో మోహమూ, జ్వరమూ, విరహమూ మాయమైనాయి. కాని పాపం సుందరమ్మ నవనీతహృదయం తాళలేకపోయింది. తనవల్లనే అతను ఆ విధంగా లేవలేకండా పడుకున్నాడని దిగులుపడ్డది. ఇంకోహృదయం తనకోసం కోర్కె పడుతోందంటే, స్వయంగా యిష్టం లేకపోయినా స్త్రీహృదయం సంతోషించకండా వుండడం సృష్టికే విరుద్ధం. సుస్వభావులు జాలిపడి తీరతారు. దుర్మార్గులు అదే వీలని స్వార్థాన్ని సాధించుకుంటారు.

సుందరమ్మ అతనిపక్క దగ్గిర నుంచుంది.

"వెర్రివాడా! యేమిటీ పెంకెతనం? ఎవరికన్నా తెలిస్తే నవ్వరా!"

మాట్లాడలేదు.

"మామయ్యతో చెప్పనా?"

అతని బలహీనత్వం ఆమెకూడా కనుక్కున్నది. మాత్రపని చేసింది.

"వొద్దు."

"మరి సరిగా పత్యం తీసుకుని లేచి తిరుగుతావా లేదా?"

"ఊఁహూ."

"ఐతే చెపుతా." "........."

"మరి యీపంతమేమటి?"

"ఇది నీకు పంతంలాగు కనపడుతోందా? నిజంగా నాకేమీ నయించదు. నాబాధ యెవరితో చెప్పుకోను? దిక్కులేనివాణ్ణి! నాకు అమ్మా, అప్పా! ఇట్లానే మాడిచస్తే, లోకానికే పీడ వొదిలిపోతుంది. ఇట్లాంటి వెధవని నేను బతికేం బతక్కేం? నీకుమాత్రం యీదయ యెందుకు? ఈ నిర్భాగ్యుణ్ణి యిట్లా గావనీ."

ప్రతిమాటా, పాపం ఆవెర్రి హృదయంమీద మోగుతోందని తెలుస్తోంది ఆతనికి. ఆమె కళ్లలోని విచారమూ, ఆచేతుల ఆత్రుతా, పెదివు వొణకడం, అన్నీ తెలుపుతున్నాయి. యోచిస్తోంది. ఏం మాట అంటుందో, తన అదృష్ట మెట్లా వుందో! అని అతి ఆత్రుతతో చూస్తున్నాడు.

"తప్పు. అట్లాంటి వుద్దేశ్యమే ఘోరమైన పాపం. నేనెన్నటికీ వొప్పు కుంటాననే ఆశపడకు. నీకైనా, నాకైనా చావే నయం."

నిరాశ! ఆపలుకుల్లోనే తెలుస్తోంది. ఆమె కంఠంలోని నిశ్చితత్వమే తెలుపుతోంది. కాని—

"చస్తాలే వెళ్ళు. పైగా వొచ్చి నన్ను ఏడిపించడం యెందుకు?"

"నీకు జ్వరంలో మతి చలించింది. కాకపోతే నీ దుర్మార్గం నీకు బోధపడి ఉండును. నేనెవరనుకున్నావు? నా ప్రాణముండగా అట్లాంటిది జరుగుతుం దని ఆశపెట్టుకోకు."

లాభంలేదని తెలుస్తోనే వుంది. కాని "నామీద యిష్టంలేదుగావును! అవును నేనేమి ధనవంతుణ్ణా, రూపవంతుణ్ణా—"

"చాలు. ఊరుకో. ఎవరైనాసరే, మాయింటా, వంటాలేదు. మా కుటుంబం సంగతి నీకు తెలీదు. ఇక్కడ దిక్కులేక చేరామని మమ్మల్ని ఏమేమిటో అనుకుంటున్నావు. అట్లాటి వెర్రిఆశలు పెట్టుకోకు. ఎవడైతే నేం— నేనేమిటి? నా మనసు మారడమేమిటి?"

కళ్లు మెరుస్తున్నాయి. ప్రపంచాల్నె లెక్కచెయ్యక, తను దీక్షలో తపస్సులో, గర్వించి, అధికారాలనూ, ఐశ్వర్యాలనూ దిక్కరించిన తన వంశీయపురుషుల తేజం ఆమె ముఖంలో తాండవ మాడింది. శపించి వచ్చిన పార్వతీదేవిలాగు, తన అద్భుత సౌందర్యంతో వెలుగుతోనుంచుంది. చంద్ర శేఖరం విభ్రాంతుడైనాడు.

"క్షమించు. ఇంకెన్నడూ అట్లా అనుకోను" అని కన్నీళ్లు పెట్టుకున్నాడు.

ఆ వొక్క మాటతో ఆమె మనసు కరిగి, అతని దగ్గిరిగా కూచుని మీద చెయ్యేసింది. పార్వతీదేవి, వరాలియ్యడానికి సంసిద్ధురాలయింది. "నువ్వే, నువ్వు నాకో తమ్ముడు, అట్లావుండు. నాకు తమ్ముడుండాలని ఎంతో వుండేది! మా అమ్మకన్న నాకే యెక్కువ ఆశ! అట్లా వుండుగాని. ఏమి?"

కాని ఎంతఅగ్నిని మాటకట్టుకుంటుందో ఆ దయవల్ల ఆమె యెరగదు. ఒక్కసారి పురుషహృదయంలో మోహం మొలకెత్తినతరవాత అది మచ్చే కనపడక యెండకన్నా యెండాలి, లేక కాలుకింద నలగనన్నా నలగాలి. కాని యిట్లా నీళ్లుపోసి, యింకోదోవన తిప్పుదామంటే యెవరితరమూ కాదని తెలీదు ఆమెకి. ఎటువంటి క్షుద్రుడికి తన హృదయ సామీప్యాన స్థల మిస్తోందో, ఆమె కెట్లా తెలుస్తుంది? ఈ సోదరప్రేమ, పితృప్రేమ, 'అన్‌కుల్' ప్రేమ, యిట్లాంటి విభజనలన్నీ, మాటల్లోనేగాని, హృదయాలలో వాస్తవత్వం లేని విషయాలని తెలుసుకోగలదా? దొంగతనానికి, మోసానికి వుపయోగించే చక్కని తెరలనేసంగతి తెలీనే తెలీదు.

లోకమంటే యేం తెలుసును? తనపుణ్య లోకాలనువిడిచి, అన్యాయపు శాపంవల్ల దారితప్పి, విచిత్రపాపలోకాలలో చిక్కి, వాటిసంగతి అర్థంగాక బాధపడే ఉపకన్యకలె, పాపం, సుందరమ్మ, ప్రతివిషయంలోనూ, కలవరపడుతోంది. తనవూళ్లోనే, యింటోనే, తన ఆచారంలో, పవిత్రతలో పూజలలో, అర్చనలలో, వుంటె ఇటువంటి నీచప్రజ ఆమెవంక కన్నెత్తిచూడటానికి వీలయ్యేదా? కాఫీకి, సన్నని చీరలకి, పంపుదగ్గర నీళ్ళకీ, చాకళ్ళకీ, సబ్బు బిళ్ళలకీ, రైళ్లకీ, రోడ్డుదుమ్ముకీ, సిగరెట్టు పొగలకీ, లేకిచూపులకీ లొంగిపోయింది గనుకనే, సామాన్య బాలికవలె తోచింది, అంత చులకనగా అతని కళ్లకి!

"నేనింకో వుద్దేశ్యంతో అనలేదు. నామీద దయగా వుండమన్నాను అంతే" అన్నాడు గుటకలుమింగుతో.

"మంచివాడివి".

జబ్బు నయమై లేచాడు. అప్పణ్ణించి సుందరమ్మని జలగ మల్లే పట్టుకున్నాడు. ఎప్పుడు తనకు కనపడుతో వుండాలి, వీలైనప్పుడల్లా దగ్గిరకూచోవాలి, మాట్లాడాలి. ఎవరన్నా అట్లా వెడుతున్నట్టుంటే ఏమీ ఎరగనట్టు లేచిపోవాలి. చనువు తీసుకోపోతాడు. అది తమ్ముడి చనువుగా వుండదు.

తదేకదీక్షతో, దిగులుతో, ఏదో తనని ద్రోహంచేసినట్టు చూస్తాడు. ఆమె సౌందర్యంముందు దీపాన్ని తాకేందుకు వీలులేక, చుట్టూతిరిగి జతిమాలే పురుగులాగైనాడు. కాని దీపం సహించలేకుండా వుంది.

ఇదెక్కడి భ్రాతృత్వం కొనితెచ్చుకున్నాను, అనుకుంటోంది సుందరమ్మ. సాయంత్రం చీకటి పడుతోంది. బాదం చెట్టుకింద సుందరమ్మ కూచుంది. ఆకుల్లో సన్నని చంద్రుడు వూగుతున్నాడు. ఎంతో శాంతంగా కూచుని ఆలోచించుకోవచ్చును కదా అనుకుంటోవుండగా చంద్రశేఖరం వొచ్చాడు.

"మధ్యాహ్నం రాలేదేం?"

"ఎందుకు వూరకే రుస్సుమంటావు?"

"ఇదేనా స్నేహం?"

"స్నేహమా? స్నేహమైతేమాత్రం? అమ్మ అడిగితే ఏం చెప్పను?"

"ఎందుకడుగుతుందేం?"

"ఎందుకడగ?"

"నేను బలవంతం చెయ్యడమేగాని, నువ్వు నీ అంతట రావు కదా?"

"వొస్తున్నది చాలు."

"చాలా, చాలా, ఇదేనా? ఇందుకేనా నన్ను బతికించింది? నువ్వు చెప్పినవన్నీ అబద్ధాలేనా?" అని యేడ్చాడు. ఆమె మనసు కరిగింది.

స్త్రీ ఒకమాటవల్ల, చూపువల్ల పురుషుడికి సందిచ్చిందా, ఇంక అతని అధికారానికి, ప్రార్థనలకి, కోరికలకి అంతంవుండదు. అసలు పర్యవసానం అక్కర్లేని స్త్రీ మొదటినుంచీ విముఖంగానే వుండాలి. నిప్పు వొళ్లోనూ వుండాలి, కాలనూ కూడదని చాలమంది మూర్ఖుల ఆశ. కోర్కెలు హెచ్చుతున్నకొద్దీ, భయాలు హెచ్చుతున్నాయి. ధైర్యంలేని కాకి బతికిన కప్పని పట్టేట్టు, కొంచెం దగ్గిరికివొచ్చి ఆశపెట్టేదీ, బాగా దూరంగా జరిగేది. వొదలలేదు, వొదలుకోలేదు. కావాలి, మళ్లీ అపాయంలేకుండా కావాలి. ఇది చాలామంది ఆలోచించి కొలిచి, చేసి, సమీపించి ఇతరులబాధచూసి, ఆనందిస్తారు. కొందరు యితరులకు బాధగావుంటుందేమో అనేది యోచించక, తమ స్వార్థాన్నే చూసుకుంటారు. పాపం సుందరమ్మబోటి అమాయికలు, అపాయమే వున్నదని తెలీనివాళ్లు, గోతులో పడతారు.

ఇంకోరాత్రి దీపందగ్గిర కూచుని చదువుకుంటోంది సుందరమ్మ. అరుగు

అవతల చివర కూచుని తగ్గించిన కంఠస్వరంతో చంద్రశేఖరం మాట్లాడుతున్నాడు. రాత్రి పది దాటింది. అతను నొచ్చుకుంటాడనే భయంతోనే ఆమె కూచుంది అంతసేపూ మేలుకొని.

"ఈరాత్రి నువ్వెంతో బావున్నావు."

సుందరమ్మ మాట్లాడలేదు.

"మాట్లాడవేం?"

"ఏం మాట్లాడను?"

"అవును. నాతో మాట్లాడాలంటే నీకు ఏమీ తోచదు."

మాట్లాడలేదు.

"పోనీ, ఇష్టం లేదనరాదూ?"

ఏమీ చాతకానప్పుడు పోట్లాటవల్లనైనా సామీప్యం దొరుకుతుందేమోనని ప్రయత్నిస్తారు మానవులు.

సుందరమ్మ పోట్లాడదు. మాట్లాడదు. అతనికేదో వాగ్దత్తం చేశామే, నమ్మింనామే అనుకుంటుంది. అతని రోదనవల్ల.

చుట్టుచూశాడు. అతని కాంక్ష అతనికి సాహసాన్నిచ్చింది. చప్పునలేచి దగ్గిరికి వెళ్ళి కూచున్నాడు. ఆమె తలవొంచుకు చదువుకుంటోంది. మీద చెయ్యివెయ్యాలనుకున్నాడు. కాని కోపంవస్తే, ఆమెకు వున్న దయకూడా యీమాత్రం చనువుకూడా తప్పిపోతే! కాని నెలలనించి తాను పడుతున్న బాధ తలుచుకున్నాడు. ఎన్నాళ్లయినా ఇంతేకదా? చెయ్యి యెత్తబోయినాడు. వూరుకున్నాడు. ఏమీతోచక కూచున్నాడు. ఆమె మెడమీద పురుగు పాకుతోంది. పురుగుఅని తీసేశాడు.

మళ్లీ చెయ్యి అక్కడే పెట్టాడు.

దూరంగా జరిగింది.

"ఎందుకు దూరంగా వెడతావు?"

"నన్ను తాకవొద్దు."

"ఇంతలో ఏమయింది?"

"నాకు యిష్టంలేదు. అట్లాతాకితే నేను రాను."

"ఎంత బావున్నావో!"

"బావుంటే బావున్నాను."

తనకేమీ లాభంలేదని తెలుస్తోంది. కాని రోషం ఎక్కువవుతోంది. అతనిమీద ఆమె దయ తలిచివుండకపోతే, అతను గౌరవంగా దూరంనించే పూజించివుండును. కాని యిప్పుడు తనని నమ్మించి మోసంచేసినట్టు కనపడుతోంది అతనికి.

"ఒకటే పురుగులు!" అంటో చప్పున దీపం ఆర్పి ఆమెమీదపడి చేతులతో పట్టుకుని, తనముఖంతో ఆమె ముఖాన్ని వెతుకుతున్నాడు. ఒక్క నిమిషంలో విదిలించుకుని తటాలున లేచింది. ఇంకా మోకాళ్లు పట్టుకుని వేళ్ళాడు తున్నాడు. కాళ్ళు యీడ్చుకుని వొదిలించుకుంది.

"ఛీ, దుర్మార్గుడా, పాపీ, ఛీ, ఛీ, పాడుబతుకు! పాడులోకం! ఛీ, ఛీ, పాపపులోకం!" అనుకుంటో లోపలికి వెళ్ళిపోయింది.

చంద్రశేఖరం ఆమెమీద తాచువలెపగపట్టాడు. ద్వేషానికీ మోహానికీ చాలా సన్నిహితం. రెండూ వున్నాయి అతని మనసులో. ఆరాత్రి శపథం తీసుకున్నాడు, లోకాలన్నీ ఏమయినా కానీ, సుందరమ్మని అనుభవించాలనీ, లోబరుచుకోవాలనీ. "ఇప్పు డేమంటావు?" అని బిగ్గరిగా నవ్వాలనీ, తనను ప్రేమింపచేసుకుని, తాను తృణీకరించి, ఏడిపించాలనీ—చంద్రశేఖరం—ఉదారత్వంలో, సహృదయత్వంలో, ఆత్మవిశాలత్వంలో, పావనత్వంలో, తేజస్సులో, అందంలో, దేనిలోను ఆమె గోరుకుపోలని చంద్రశేఖరం, యీ కృత్రిమ ప్రపంచసహాయంతో, స్త్రీని గాజుపాత్రవలె ప్రతినిందకూ, అనుమానానికీ గాయపడేటు అతిహీనంగాచేసి, ఆమె రోదనానికి బధిరమయిన యీ నాగరికతాసహాయంతో వశపరుచుకోవాలని చూశాడు.

తాను చేసినపని యెవరితోనూ చెప్పని ఆమె వుదారత్వమూ, తనమీద జాలిపడి, యిష్టంలేకపోయినా ఆదరించిన ఆమె దయా, తన నీచత్వాని, క్షుద్రత్వాన్ని మరిచిపోగలిగిన ఆమె సౌశీల్యమూ, పరపురుషుడంటే కన్నెత్తని ఆమె నిర్మలత్వమూ, ఆమె సౌందర్యములోని శుభతేజస్సు, ఏమీ అతని మనస్సుని మార్చలేదు.

ఏనింద వొచ్చినా స్త్రీకదా మొదట భరించ వలసింది? ఆమె తన బాధ చెప్పుకున్నా తప్పు ఆమెదే అంటారు కదా! పురుషుడు దౌర్జన్యంచేసినా, పవిత్రుడే. పతిత, అయ్యేది ఆమే కదా! సృష్టి తనముద్రను ఆమె ఉదరం మీదనే కదా లిఖించేది! పురుషుడికన్న జిత్తులతో టక్కరన్నా కావాలి,

అతనికి స్థలమివ్వని పాషాణమన్నా చేసుకోవాలి హృదయాన్ని. ఎక్కడా బయటపడని మోసగత్తె, అబద్ధీకురాలన్నా కావాలి, లోకంలో కీర్తిపొందా లంటే! మంచివారని కీర్తిపొందిన స్త్రీలందరు, యీజాతిలో ఒకదానికి చెందినవారే! దయ, రసన, న్యాయము, సత్యము—యీ సుగుణాలే స్త్రీని అధోగతికి లాగేగుణాలు. ఇటువంటి అధోగతికి తెచ్చింది స్త్రీని యీ పాతి వ్రత్యాదర్శము; యీపవిత్ర నిబంధన.

మళ్లీ నెలలు గడిచాయి తన ఆఖరు 'డెస్పరేట్' ప్రయత్నంకోసం సమయం కనిపెట్టివున్నాడు చంద్రశేఖరం. ఆమెతో మాట్లాడడు. ఆమెవొంక చూడడు. ఆమె చాలసార్లు కనికరించి మాట్లాడాలనుకుంది. కాని అతనికోప లక్షణాలుచూసి మానింది.

వెంకట్రామయ్య కుటుంబంవారు పెళ్లికివెళ్లారు. ఆయన మేడమీద పడు కున్నాడు. తల్లి వంటింట్లో పడుకుంది. గుమ్మానికెదురుగా హాల్లో సుంద రమ్మ పడుకుంది. ఆరాత్రి తన విజయవ్యూహం పన్నాడు చంద్రశేఖరం. తాను పూజించిన దేవతలందరూ, తమ వంశాభివృద్ధికోసం, క్షేమంకోసం, వాళ్లు ఆహ్వానించిన దేవతాశీర్వచనాలన్నీ ఆమెను కాపాడుతున్నారన్న అభి ప్రాయమున్నట్టే నిద్రపోతోంది సుందరమ్మ. ఏకలతా లేనిమనసుతో, ముసు గున్నా అందాలొలికే కళ్లతో, వూపిరితోపాటు వొంపులుగా లేచిపడే తెల్లని నిర్మలవక్షంతో, వొంటివొంపుల్ని వ్యక్తపరిచే సన్నని చీరకుచ్చెళ్లతో— తన జీవితాన్నంతా మార్చి, మాడ్చి, రూపులేకుండా నాశనంచేసే, ప్రళయం సమీపిస్తోందనే ధ్యాసేలేకండా నిద్రపోతోంది. ఏ పితృదేవతలూ, కలలో నన్నా ఆమెకు హెచ్చరిక నివ్వలేదు. ఏదో రూపానకూడా ఏదేవతలూ, ఆమేకి మెళుకువ తెప్పించలేదు. ఎవరూ లేరో? వుండి సహాయం చెయ్యరో, యీపూజలు, ప్రార్థనలు, జపాలు, మంత్రాలు, అన్ని ఏమిలేని శూన్యంలోకి పంపుతున్నారో, ప్రజలూ, ఆదేవతలూ, దెయ్యాలూ, ఆత్మలూ, వుండికూడా సహాయం చెయ్యలేవో, ఏపాపంవల్ల, యిట్లాంటి ఘోరవిపత్తు తనమీదికి తానెరగకండా తెచ్చుకుందో; ఏమీ ఎరగనిది, పరమపావనురాలు, దయా పూరిత హృదయ, ఒక్కచీమకు హానిచెయ్యనిది, ఒక్క కల్మషమైన ఆలో

చనలేనిది, లోకక్షేమానికై నిరంతరమూ దేవతల్ని యాచించేది, సుందరమ్మని, రెక్కలువిరిగిన పక్షిని పిల్లినోటి కందిచ్చే విధాత, సృష్టికర్త చంద్రశేఖరానికి వప్పచెప్పాడు.

అర్ధరాత్రి మెల్లిగాలేచి హాలు తలుపుదగ్గర నుంచున్నాడు. సంతోషించాడు. ఇట్లా ఆలోచిస్తే, తనగతి అంతేనని పురెక్కించుకున్నాడు. గుమ్మం లోకిపోయి ఆమెని చూచాడు. నిష్కారణమైన జాలి తలెత్తింది. నొక్కిచంపేశాడు. ఆమె అందాన్ని చూసి, తనకు కలగబొయ్యే సౌఖ్యాన్ని తలుచుకున్నాడు. దీపమార్పెయ్యాలా? ఆమె అరిస్తే? కాని అరిచేదైతే తననిచూడగానే యింకా అరుస్తుంది. జాకెట్టులేకండా ఆమెని చూడాలనివుంది. ఆచీర లేకండాకూడా! కాని ధైర్యంలేదు. వెళ్లి చప్పుడుకాకండా ప్రవేశించి దీప మార్పాడు. ఎన్నాళ్లనించో కోరుకుంటున్న సౌఖ్యం లభించబోతోంది. ఆతృత వల్ల కొంతభాగమూ కామోద్రేకంవల్ల కొంతభాగమూ, రక్తం కొత్తకొత్త మార్గాల, అతనెన్నడూ ఎరగనివిధాల ప్రవహిస్తోంది. తన మనోరథం సఫలమన్నా కావాలి, లేక ఆయింటోంచి తన్నులు తిని లేచన్నాపోవాలి. చీకటయ్యేప్పటికి అతనికి ఏమీ కనబడలేదు. మంచమెటో ఆమె యెట్టువుందో కూడా తోచలేదు. తల తిరుగుతోంది. ఇప్పుడు చూచినవొస్తువులే ఎంత నిగూఢమై పోయినాయో! మెల్లిగా అడుగుమీద అడుగువేస్తో వెళ్లాడు. మంచం తగిలింది. ఆగిచేత్తో మెల్లిగా యిటూఅటూ వెతికాడు. ఆమె తొడ తగిలింది. ఆమె తలనితాకి చూసుకుని, సక్కనే పడుకొని ఆమెమీద చెయ్యి వేసి బుగ్గమీద ఆనుకున్నాడు. ఇంతవరకు స్త్రీ నెరగక, ఎప్పుడు యిట్లాంటి సౌఖ్యం దొరుకుతుందా అని కాచుకునివున్న అతని నరాలు మహదానందంలో వూగులాడాయి. గొప్పసంతోషం సంతుష్టికలిగి, భయమేమరచిపోయినాడు.

ఆమెకి మెలుకువ వచ్చింది. చటాలున పురుగునో, పామునో తోసేసినట్టు రెండుచేతులతో నెట్టింది. కాని, ముందే ఆలోచించుకున్నప్రకారం అతను గట్టిగా తనచేతిని ఆమెనోటి కడ్డంపెట్టి యిట్లా అన్నాడు:

"నేనేమీ చెయ్యను. నామాట విను. ముందు తరవాత నీయిష్టంవొచ్చినట్టు చెయ్యవొచ్చు. బాబుగారితో చెప్పి చెప్పుతోకొట్టిస్తే పడతాను. నేను యెట్లానూ పోవడానికి సిద్ధపడ్డాను. నీకు వొచ్చిన అపాయంలేదు. అరవకు. నామాట వింటానంటే నాచెయ్యి తీస్తాను."

ఆమె పెనుగులాడడం మానింది. చెయ్యితీశాడు.

"ముందు యీ చెయ్యి తియ్యి."

తీశాడు.

"నన్నంటకుండా అట్లా నుంచో."

దూరంగా జరిగి కూచున్నాడు.

"చెప్పు."

"నేను ఎంతకాలంనించో నిన్ను మోహించాను. కాని నువ్వు నామీద దయచూపలేదు. పైగా మోసగించావు. ఇంక నాకు జీవితంమీద నిరాశ పుట్టింది. నీదయలేక నేను బతకలేను. నువ్వు వొప్పుకుంటే, నా అదృష్టం. నీ పేరు చెప్పుకు బతుకుతాను. వొప్పుకోవా నీముందు యిక్కడే చచ్చి పోతాను."

సరిగా ఆమె మనసును కరిగించగల మాటలు అతనికి తెలిశాయి. ఆలోచించకుండానే ఆ చీకట్లోకూడా అతనికి తెలుస్తోంది ఆమె జాలిపడుతోందని. అతనిమాటల్లో వున్న సగం వాస్తవమైన బాధా గుర్తించింది. కాని, తక్కిన సగం నాటకాన్ని గుర్తించ లేదు. అబద్ధీకులైతేనేగాని అబద్ధాన్ని గుర్తించలేరు. కాని యింకా ఆమెశీలం ఆమె జాలికి అడ్డుపడుతోనే వుంది. నిజంగా చచ్చిపోతాడని నమ్మింది. పురాతనంనించి పెరిగిన సర్వభూతదయ, పరప్రాణికోసం తన సౌఖ్యాన్ని త్యాగంచేసిన ఔదార్యం, బ్రహ్మహత్యా పాతక మహాభయం, అతిథి మోహ తృప్తికోసం శీలాన్ని అర్పించిన మహా పతివ్రతలకథలు అన్నీ ఆమె నిశ్చయాన్ని బలహీన పరిచాయి.

"తప్పు. పాపం."

తనని తృణీకరించకుండా, 'అర్ఘ్యా' చెయ్యడంలోని బలహీనత్వాన్ని కని పెట్టాడు. ఆమెమీదికి వొంగి కావిలించుకున్నాడు.

"పో."

"వెళ్ళను."

"అరుస్తాను."

"కానీ. నన్ను చంపించు. నేను వొదలలేను."

తప్పించుకునే పిట్టను పట్టుకొని వేళ్లాడే పిల్లివలె పెనుగు లాడాడు.

"పిలుస్తాను. నిన్ను చంపుతారు, పో."

"పిలు. చంపనీ. నాప్రాణాల్ని నీకోసం అర్పిస్తాను."

"ఎవరన్నా చూస్తే!"

ఆమాట స్త్రీనోటినించి వొచ్చిందా, ఇంక భయంలేదు. ఆహ్వానంతో తుల్యమైనది. సంతోషంతో, స్వతంత్రంగా, మాట్లాడకండా, యింకా ఆక్రమించుకున్నాడు. చేతివేళ్ళు, ఎవరూ, ఆమెభర్తప్ప, ఎవరూ తాకని, తాకకూడని స్థలాల్ని వెతికి, అపవిత్రంచేసి అనుభవిస్తున్నాయి. సృష్టి, కష్టపడి నునుపుపెట్టిన మృదుభాగాలు, దేవతలకైనా చూడడానికి అర్హత వున్నదా అనిపించే భాగాలు, ఏ అందాన్ని కల్పించగలమా అని చిత్రకారులు నిరాశ చెందే మృదుత్వమూ లావణ్యమూగల అవయవాలని తాకే అదృష్టం, ఎట్లా సంపాయించాడో ఆయువకుడు! ఏ పూజలుచేసి, ఏదేవతల్ని తృప్తిపరచాడో!

ఆమె శరీరం తిరగబడి, అతన్ని అభిలషించింది. ఆనందించింది. ఇంకా దగ్గిరిగా కోరింది. పాపం, యింకా ఆమె ఆత్మ తిరగబడుతోనే వుంది. 'లోబడి పోతున్నావు, ఇంక వెనక్కి మార్గంలేని మహాకూపంలో పడుతున్నావు. వొద్దు' అని అరుస్తోంది.

"ప్రమాణం చెయ్యి."

"నీ కళ్ళమీద, యీ......మీద ప్రమాణం చేస్తున్నాను."

ఆ రెండోమాట ఆమె వినలేకపోయింది.

"ఛీ" అని అతనిమాటనూ, అతన్నీ విదిలించింది.

పవిత్రత హీనస్వరంతో అసహ్యపడుతోంది. కాని యీదేహానికి సంబంధించిన నరాలు అతన్ని దగ్గిరిగా పిలిచి ఆమెనోరు నొక్కాయి. అంతే; ఆఖరు. గొంతు బిగిసి వూపిరాడలేదు. అంతరాత్మ అనేది కళ్ళు తేలవేసింది. దేహం విజృంభించి రాజ్యం చేసింది. ఆమె రెండుచేతులూ అతని నడుంమీద వేసి ఆ అల్పుణ్ణి మళ్ళీ మళ్ళీ లాక్కుంది. అతని చేతుల్నీ బుగ్గల్నీ కరిచింది. జుట్టుని చీదరగా లాగిలాగి నరాల బాధ తీర్చుకుంది. అతన్ని ఆనంద డోలికల్లో వూగించింది.

"వొద్దన్నావు!" అని విజయభేరి మోగించాడు ఆ నీచుడు.

"మాట్లాడకు" అంది ఆమెశరీరం.

అలిసి తనపక్కన సోలిన చంద్రశేఖరాన్ని చూసి అతిజాలితో కౌగలించుకో బోతోంది. కాని ఆ మహాదృష్టం అతనికి లేదు. ఈ ప్రపంచంలో

కృతజ్ఞతతో స్త్రీలు యిచ్చే బహుమానాల్లో కల్లా బహుమానమయిన ఆ కౌగిలిని స్వీకరించే ఔదార్యం అతనికి లేదు.

అతను బనియను సర్దుకుంటూ వ్రాడేబట్టని ఒక చేత్తో పయికి పట్టుకుని పక్కదిగి కాళ్లు తుడుచుకుంటూ వెళ్లి పోతున్నాడు. అతిదయతో అతని వంక ఆమె, వాన వెలిసిన తరవాత మబ్బులవంక సూర్యుడు చూసే చూపు వంటి ఆమె చూపును గాని...తరవాత అతి తృణీకారంతో అతనివంక చూసిన వెనక చూపుగాని అతను ఆ చీకట్లో చూడలేదు...

"నువ్వు చేసిన పనేమిటి? ఆలోచించాలి. పట్టు" అంది ఆమె అంతరాత్మ. "నోరు మూసుకో. ఐపోయిం దేదో ఐపోయింది, ఇంక అది మళ్లీ జరగ బోవడం లేదు. ఇంకెందుకు ఆ ప్రస్తావన" అంది ఆమె మనస్సు. "కాదు. ముందు నీ నీచత్వం తెలుసుకుంటే ఏనాటి కయినా మంచిది" అంది అంత రాత్మ. "నాకు నిద్రవొస్తోంది. అయినా నేనేమీ ఆ విషయం ఆలోచించ తలచుకో లేదు. ఇంక పడివుండు" అని కసిరి ఆమె నిద్రపోయింది.

తెల్లవారగట్ల పెద్ద భయంతో ఆమె వులికిపడి లేచింది. ఏదో కల వచ్చింది. జ్ఞాపకం తెచ్చుకోవాలంటే చేత కాలేదు. పక్కమీద వొణుకుతో కూచుంది. దీపం వెలిగితే బావుండును! కాని కాలుగాని చెయ్యిగాని కదిలించడానికి భయం. నిప్పు పెట్టె యెక్కడవుందో! మెల్లిగా అమ్మని పిలిపించింది.

"ఎందుకే?"

"నాకు భయమేస్తోందే."

"భయమా? ఎందుకు భయం? భయమేమిటి! ఇట్లా వచ్చి పడుకో..." అంది తల్లి. ఆమె కంఠం వినేప్పటికి కొంచెం భయం పోతోంది. ప్రియ త్నించి మెల్లిగా లేచి వెళ్లి తల్లివీపు వైపు పడుకుని ఆమెని కావిలించు కుంది. అంతరాత్మ మళ్లీ మేలుకుంది. "నీ తల్లి ఎంత సాధ్వి! పాపం నువ్వు చేసిన నేరాన్ని ఎరగదుగదా! ఎన్నడూ ఇటువంటి నీచాలకు లోబడ్డది కాదు కదా నీతల్లి! నిన్ను ఇంత ప్రేమించి నమ్మినందుకు చివరికి ఇట్లా చేశావా? దిక్కులేక—డబ్బులేక—ఇతరుల పంచను తల వొంచుకొని బతుకుతో ప్రాణా లన్నీ నీమీదే పెట్టుకొని వుంటూన్న నీతల్లిని ఎంత అన్యాయం చేశావో తెలుస్తోందా?"

అంతరాత్మని తిట్టి వూరుకోమని సుందరమ్మ నిద్రపోయింది.

మర్నాడు, రాత్రిసంగతి తలుచుకున్నప్పుడు—భర్తా—ఆయనతో తాను గడిపిన రాత్రులూ జ్ఞాపకంవొచ్చాయి. కాని ఆ ఆలోచనల్ని తోసేసి పగలంతా పనుల్లోనూ మాటల్లోనూ గడిపింది. రాత్రి పడుకోడానికి వచ్చి పక్క చూసేప్పటికి అనాలోచితంగా పెద్ద సంతోషం వచ్చింది. అది వృతమంచం కాదు, దుప్పటికాదు, జీవితానికంతా వెలుగు యిచ్చే మహాశక్తితో పవిత్రమైంది. ఆనందానుభవంవల్ల సుందర మైంది. చూస్తో నుంచుంది. వెంటనే తన ఆనందానికి భయం వేసింది. ఏమిటిది? ఆపాపకార్యం—నీచకార్యం తలుచుకుని సంతోషపడుతోంది తాను. ఇంక తనగతి ఏం కాను? అసలు అతను వస్తాడా?...ఆ ఒక్క రాత్రేనని వాగ్దానం చెయ్యలేదా అతను?...రాడు. రాకపోతే తనకు తోచదు. చంద్రశేఖరము— ఆమె కామజ్వరానికి మందివ్వగల చంద్రశేఖరం ఆమెశరీరం ద్వారా హృదయాన్ని ఆక్రమించుకున్నాడు. అతని నీచత్వం—అతను ప్రాధేయ పడడం—అన్నీ తన దేహసౌఖ్యంలో అనుభవానందంలో మరిచి పోయింది.

సాధారణంగా కవులు స్త్రీహృదయానికి మార్గం ఆమె మనస్సు అంటూరు. కాని చాలా హృదయాలకి మార్గం రెండో చివర వుంటుంది. అందువల్లనే సామాన్యస్త్రీలంతా పెండ్లిచేసుకొన్న పురుషుణ్ణి ఆరాధించడానికి వీలు అవుతోంది. స్త్రీ నిజంగానే కళ్ళు తెరిచి పరీక్షించి ఏరుకునేట్లయితే యీ మొగవాళ్లకెవరికయినా వివాహయోగ్యత వుంటుందా? కుక్క హృదయంలో అపారమైన ప్రేమ అనే "ఇన్ స్టింక్టు" వుంది. దానిని ఎవరిమీదనో ఒకరిమీద కనపరిస్తేనే కాని కుక్కకి శాంతి వుండదు. అందుకని ఆమనిషి స్వభావం ఎటువంటిదా అని యోజించకండా ఒకముద్ద అన్నం పడవేసిన వాణ్ణి ప్రేమించి తనని తన్నినా, వెంటబడి ఆరాధించి తన జీవితాన్ని సార్ధకం చేసుకుంటుంది. చాలామంది స్త్రీ లింతే.

పూలమొక్క తీగె సాగేసరికి దేనిమీదనో ఒకదానిమీద అది పాకాలి, పాకకుండా బతకలేదు. ముళ్ళచెట్టుగాని, చెదలుపట్టిన కర్రగాని ఏమీ ఆధారమివ్వని రాయిగాని దగ్గిరలోవున్న దేన్నయినాగాని ఆధారం చేసుకుని పాకుతోంది. ఆలాగే స్త్రీకూడా సంఘమో, విధో, అదృష్టమో, యజమానో, ఎవరో దేన్ని ఆధారంగా చూపితే దాన్ని వివక్షతలేకండా గుడ్డిగా

ఆధారం చేసుకుని కావలించుకుంటుంది. తన యవ్వనాన్నీ తన సౌందర్యాన్నీ, తన పూజ్యభావాలనీ—సమస్తాన్నీ అర్పించి ధన్యత పొందుతుంది. ఆమోహని వాననించి, ఎండనించి, శత్రువులనించి, కష్టాలనించి కాపాడే ప్రయత్నంలో తన శరీరాన్నీ తనయావత్తుని అర్పిస్తుంది. ఆ ముద్దునే అధికుడంటుంది. రసికుడంటుంది. స్వర్గమంటుంది. దైవమంటుంది.

ఆ సౌందర్యమూ, ఆ స్వర్గమూ, ఆ రసికత్వమూ, తన హృదయంలోనే కాని ఆ ముద్దులో ఆమోహంలో లేవని తెలుసుకోలేదు. ఏ వెంకటచలమో కథలు వ్రాసి కళ్ళు తెరిపించేదాకా ఒక నీచుడి కాళ్లకిందపడి దొర్లుతో అదే స్వర్గం అదే ఆనందం అనుకుంటుంది.

అన్ని సమయాలలో కళ్లు తెరవరు. తెరవలేరు. తెరిచే శక్తీ ధైర్యమూ వుండదు. వాస్తవమైన విలువా, జీవితంలోని కాపట్యము, తెలుసుకుంటే అక్కడ ఒక్క నిమిషం ఆ నిర్జీవ క్షుద్రపరిస్థితులతో తృప్తిపడి బతకలేరు. గతాభిమానులై గాయపడి తమ అల్పతాన్ని గుర్తించి తిరుగుబాటులో దౌర్జన్యంలో తమ కోమలత్వాన్నీ సూనృతాన్ని భగ్నం చేసుకుంటారు. ప్రయత్నించి వివేకంతో సాహసంతో, నూతనంగా జీవితనాశాన్ని మళ్ళీ చిగిరింప చేసుకోగల శక్తిగలవారు అరుదు. అందువల్లనే లోకంలో ఇంత అలసతా, అబద్ధమూ, కపటమూను; సంస్కారమంటే, నూతనత్వమంటే యింత ద్వేషం.

“వొస్తాడా?......రావడానికి గుండె లున్నాయా? వాగ్దత్తం చేసి పయిగా సిగ్గులేక భయంలేక వొస్తాడా? వొస్తే...తనని ఎంత నీచురాలినిగా అనుకుంటున్నా డన్నమాట! ఇష్టం లేకపోయినా శరీర సౌఖ్యానికి దాసురా లయ్యేరకం మనిషిని అని తలిచాడు కాబోలు!”

అయితే ఆమె అంతరాత్మకి తెలుసు; శరీరంకోసం దాసురా లయ్యే మనిషే నని. కాని మనోవీధిలోకి ఆ తలుపును రానీదు ఆమె. ఒప్పుకోదు నిజమని. ఒప్పుకుంటే ఆమెకు శాంతి వుండదు. ఆ వాస్తవం ఆమె మనసుని తొలుస్తుంది. కనక ఆ ఆలోచన నొక్కిపట్టి తప్పు అంతా చంద్రశేఖరం మీద నెట్టింది.

“ఒకవేళ మళ్ళీ వొస్తాడేమో? ఎట్లా? వొస్తేనేం, తనకి యిష్టం లేక పోతే ఏం చేయగలడు” అని ఆలోచించ లేదు. అటూ ఆలోచించదు. “పోనీ

అమ్మదగ్గిర పడుకుంటే; అప్పుడు అతను రావడానికి వీలుండదే? రాకపోతే ఎట్లాగ వీల్లేదు." ఆ ఆలోచన రాకూడదు. అవును. తనెందుకు పడుకోవాలి అమ్మదగ్గిర? భయమా? తనకేం భయం? తనెందుకు భయపడాలి? "భయపడుతున్నట్టు తెలిస్తే మరీ మితిమీరుతాడు. గౌరవమే పోతుంది. రానీ వాడికి బుద్ధి చెప్పాలి. వెధవ! రానీ! చెపుతా! రాకపోతే?...వొస్తాడులే. వొస్తే బాగా తిట్టి వాణ్ణి ఏడిపించి పంపితేగాని కసి తీరదు. వొస్తాడులే, రాకుండా ఎట్లా వుంటాడు? రాత్రి ఎంత ఆనందించాడు? వొదులుకోగలడా? వొస్తాడు," అనే ఆలోచనల్లో తన మనోవాంఛను పాతిపెట్టి తనను తానే వంచించుకుని నిద్రపోయింది.

నిజంగా వొచ్చాడు.

ఆమెకి వొళ్లు తెలియకముందే అతను నియుక్తుడయినాడు.

నిద్రభయంతో ఏవో ఘోరస్వప్నంలో నించి బాగా కళ్లు తెరిచింది.

"ఛీ, పో." అని బిగ్గిరిగా అంది.

"అరవకు. నేను బతకలేక వొచ్చాను." అని తన పాతరాగం ప్రారంభించాడు అతను.

"అమ్మని పిలుస్తాను."

"పిలు. నీకే నష్టం?"

తనకు లోబడిన స్త్రీని, ఆమెకెంత ఘనత వున్నా సరే, తక్కిన విధాల ఎంత ఆధిక్యం ఆమెకి వున్నా సరే పురుషుడు గౌరవించడు.

అతన్ని ఆమె నెట్టివేయడమూ అతనామెని బలవంతం చెయ్యడమూలో ఇద్దరూ అసలు సంగతి మరిచి కుస్తీ ఆరంభించారు. ద్వేషాలూ, తిట్లూ, ఘర్షణలు, ప్రాధేయపడడమూ, ఒట్లూ, పట్లూ...జరిగినయి. స్త్రీ అంగీకారం లేంది ఎంత బలవంతుడయినా పురుషుడు నిస్సహాయుడనే సృష్టి నిర్ణయం వ్యక్తమయింది.

ఓడిపోయి సిగ్గేసి స్త్రీ చేతుల్లో అపజయాన్ని భరించలేక చంద్రశేఖరం ఏడ్చాడు. అలిసి చెమటలుపోసి విసుగెత్తి ఆ పట్టుదల తనకు ఎందుకో అర్థం కాక సుందరమ్మ చంద్రశేఖరం కన్నీళ్లవల్ల గొప్ప జాలిలో కరిగిపోయి అతన్ని చప్పున కావిలించుకొన్నది. కాని మరుక్షణమే తన మూఢత్వం, బలహీనత్వం అర్థం అయినాయి. కాని కాలం దాటిపోయింది. లాభం లేకపోయింది.

అతనికోర్కె తీరింది. తన చేతుల్లో సుందరమ్మగాని కొయ్యబొమ్మగాని ఏదయినా ఒకటే ననిపించింది, అతని కంతకుపూర్వమే. పక్కన కూచుని ఆమెవంక చూచాడు. ఆమె దేహం దేహమే కానట్టు జీవమే లేనట్టూ కప్పుకేసి చూస్తో తనస్పృహే లేని సుందరమ్మని చూసేప్పటికి అతనికి సహితం తన నీచత్వం మనసుకు తట్టి లేచినవాడు కాళ్ళురాక అట్లానే నుంచున్నాడు.

"మాట్లాడవేం" అన్నాడు. దెబ్బతిన్న లేడి వేటగాడివంక చూసినట్టు ఆమె అతనివేపు చూసి గుడ్లతిప్పి కళ్లు మూసుకుంది. "కోపమా?" అన్నాడు. ఆమె మాట్లాడలేదు. ఆమెకి పెద్ద దిగులు పట్టుకుంది. ఇంక తనకి శక్తిలేదు. తన బతుకంతా ఇట్లా పాపంలో నీచత్వంలో గడపవలిసిందే. అంతే. వీడు వొదలడు, వొదలలేడు. వొదిలినా ఏ పురుషుడు సమీపించినా నిగ్రహించే శక్తిలేదు. ఇంతే, ఎప్పుడూ ఇంతే, అని మూలుగుతోంది హృదయం.

"దుఃఖమా?" అని మళ్లా అతను అడిగాడు. మాట్లాడదు ఆమె. అతనికేమీ సంతుష్టిలేదు. ఏ అద్భుతలావణ్యాన్ని చూచి భ్రమిసి అతను ఆమెని కోరాడో ఏ అందాన్ని చేతుల్లో పట్టుకుని దాచుకోవాలనుకున్నాడో అది గాలిలో మెత్తదనంలాగు పువ్వుల్లో లేతరంగులాగు తననించి తప్పించుకుంది. ఆ చీకట్లో ఆ భయంలో ఆ సుందరమ్మయితే నేం? ఆమె తల్లి అయితే నేం? భేదం స్వల్పమే. అతనికి ఎముకలూ మాంసమూ చిక్కినట్టు తోచింది. ముఖ్యంగా యీ ఆనందంలేని నిర్జీవమైన సుందరమ్మ ఎందుకు? ఈ కారణం వల్లనే రహస్య వ్యభిచారంలో ఎంతో ఆనందం వుందనుకొని వూటలూరిన మానవులూ ప్రాణాన్ని సహితం వదిలే అపాయాల్లోకి దిగే రసికులూ చివరికి దానిలోని నిస్సారాన్ని అనుభవించి చాలా త్వరలో విముఖులై నీతి బోధకులు అవుతారు.

"నీతో మాట్లాడాలి. లేచిరా" అన్నాడు చంద్రశేఖరం. ప్రశ్నార్థకంగా కళ్లు విప్పి మూసుకుంది ఆమె. "రావాలి. తప్పదు" అని ఆమె చెయ్యి పట్టుకు లాగాడు. మాట్లాడకండా లేచి గుడ్డిగా అతని వెంటనే నడిచింది. బావివెనక నిమ్మచెట్టు కింద ఆగాడు. అపరిమితమయిన చలిగావుంది. ఆకుల్లోంచి మంచుబొట్లు పడుతోన్నాయి. చంద్రశేఖరం ఏడ్పు మొదలెట్టాడు. ఆమె తనకి సంబంధం లేనట్లే నుంచుంది. తనదుఃఖం ఆమెని కదిలించలేక

పోవడం, తన చివరి ఆయుధంకూడా వ్యర్థం అయిపోయిన మహారథుడి స్థితిని కల్పించింది అతనికి

"ఇంకెప్పుడూ నీజోలికి రాను. నిన్నిట్లా క్షోభ పెట్టను నిజం. ఒట్టు."

వాగ్దానాలు అతని నోట్లోనే గాని మనసులో పని చెయ్యవు.

"మాట్లాడు. నామాటలు నమ్ముతున్నావా? లేదా?"

"సరే."

"సంతోషంగా లేరూ?"

"నీయిష్టం. కాని నన్నిట్లాచేస్తే నాకు బతుకుమీద నిరాశ పుడుతుంది. నీయిష్టం." తన బలహీనత్వాలోపాన్ని కప్పేందుకు ఆత్మనించి మనోబలాన్ని ఎరువడుగుతోంది ఆమె. కాని ఆమాటలు చాలు అతనికి "ఇంక ఎన్నడూ; నమ్ము. చేసిన పాపం చాలు" పాపం, ఆ మాటలు అతనే నమ్మకపోయినా సృష్టి వాటినే ఖాయపరుస్తోందని అతనికి తేలీదు. కాని ఆమే తనని బతిమాలి వేడుకుని వోదార్చ్బసి తికి రావాలని ఆఖరుయత్నం. "నీ అందాన్ని మరవలేను, ఇక్కడే వుంటే నిన్ను వదలలేను, భరించలేను, నిన్ను ప్రతిదినమూ చూస్తో. నేను వెళ్ళిపోతాను. నా ట్రయినింగ్—నా వుద్యోగమూ—నా గౌరవమూ అన్నీ వదిలిపోనీ; నేను వెళ్లిపోతున్నాను. తప్పదు. ఇంక కనపడను. ఏమీ చెయ్యను!"

"వింటున్నావా?" ఇంత అధికారంతో స్ఫుటంగా మాట్లాడడం అతను ఎరగడు. మళ్లా "వెడుతున్నాను నిన్నువిడిచి. కాని నిన్ను వదలలేను. నువ్వు నాదానివి. శాశ్వతంగా నాకు నీవు ముడిపడ్డావు. నన్ను మరిచిపోకు. ఎప్పుడు నిన్ను కలుసుకుంటానా అని ఎదురుచూస్తో వుంటాను. నీఅందాన్ని వికారం చేసుకోకు. నువ్వు నాదానివి."

గొప్ప శోకగీతం వ్రాస్తున్న మహాకవి హృదయంలాగా వొణికింది అతని హృదయం. రంగస్థలంమీద తన వ్యక్తిత్వం మరిచిపోయిన నటుడివలె ఆమెని కావిలించుకోబోయినాడు.

సుందరమ్మ వొప్పుకోలేదు. ఆకాశం నించి వినపడ్డట్టయింది. ఇదివరకే ప్రొద్దుట్నించీ భర్తయడల దోషంచేశాననీ, అతని ఆత్మకి కోపం వచ్చివుంటుందనీ భయపడుతున్న సుందరమ్మ యీ మాటలు వినడంతోనే పెద్ద కేక వేసి వెనక్కి పడిపోయింది. చంద్రశేఖరం చప్పున లోపలదూరి తన మంచం

మీద సురక్షితంగా ముసుగు పెట్టుకొని పడుకున్నాడు. ఆ కేకకి యింట్లో వాళ్లు లేచి వొస్తారని నిశ్చయంగా అతను యెంచుకున్నాడు. మంచుల్లో ముళ్లలో సుందరమ్మను వదిలి పెట్టివస్తున్న ఆలోచనే రాలేదు అతనికి. కాని ఎవరూ లేవనేలేదు. చాలాసేపు అంతా నిశ్శబ్దంగా వుంది. భయపు మడతల అడుగున బడ్డ చంద్రశేఖరపు కారుణ్యాం అతన్ని బాధించి దొడ్లోకి పంపించింది. అక్కడే ఆ చెట్టునీడల్లో మూర్ఛపోయిన సీతలాగా వొంటరిగా పడివున్న సుందరమ్మని చేతుల్లో యెత్తుకుని తీసుకొచ్చి మంచంమీద పడుకోబెట్టి నిద్రపోయినాడు.

అతని అంతరాత్మ అతని ధర్మబుద్ధికీ కరుణాస్వభావానికీ ధైర్యానికీ మెచ్చుకొని అతనికి జోలపాటలు పాడింది. తీరా మానవస్వభావ పరిశీలనా కుశలులు పరీక్షచేసి అతని కరుణకాదేమో, అతని భయమే నేమో సుందరమ్మకి సహాయం చేసింది అనుకుంటారు. అంతరాత్మని ఈశ్వరవాణీ—నీతీ—అని ప్రజలు నిర్ణయిస్తున్నారు. అంతరాత్మే ఈశ్వరవాణీ నీతీ అయితే ఆ ఈశ్వరుడు చాలా మూర్ఖుడయి వుండాలి. ఆ ఈశ్వరుడికే అందని అగాధపు క్షుద్రత్వమూ ఆ ఈశ్వరుడికే అర్థంగాని మహోన్నత ఉదారత్వమూ వున్నాయి మానవ హృదయంలో.

చంద్రశేఖరానికి సుందరమ్మ బతికివుందో లేదో ఏ స్థితిలో వుందో పరిశీలించే టంత వ్యవధికూడా దొరకలేదు. ఈ జరిగిన కథంతా ఎందుకు జరిపించావంటే అతను సుందరమ్మమీద ప్రేమవల్లనని నిస్సందేహంగా అంటాడు. మర్నాడు సుందరమ్మ మంచంమీదినుంచి లేవలేదు. జ్వరం వచ్చింది. పిచ్చి మాటలు మాట్లాడుతోంది. ఆ పిచ్చిమాటలలో తన పేరు చాలాసార్లు రావడం చూసి చంద్రశేఖరం ఎవరితోనూ చెప్పకండా మాయమయినాడు. వెంకట్రామయ్యగారు అతనికోసం వెతికించి "ఇంతేకదా! తీరా సుందరమ్మకి జ్వరం వచ్చి ఇంట్లో మనుషులులేని సమయంలో పని చెయ్యవలసి వస్తుందని వీడు మాయమయినాడు......ఎవరినన్నా కనికరించడం బుద్ధి తక్కువ పని" అన్నారు.

౫

పొద్దున్నే ప్రతిరోజూ వచ్చేడోకుల్ని చూసి మొదట సుందరమ్మ తల్లి అనుమానపడ్డది. అనుమానం ఆమెకు స్థిరమయిన తరవాత అడిగింది. సుందరమ్మ "నాఖర్మం" అనడం తప్ప మరొక జవాబు చెప్పలేదు. ఎన్ని సార్లు ఎన్ని విధాల అడిగినా, తిట్టినా, ఏడ్చినా, బతిమాలినా, అంతకన్న మాట్లాడదు. ఇంట్లో అందరికీ తెలిసిపోతుందని తల్లికి భయం. అందుకని కప్పిపుచ్చింది. కాని ఎంత కాలం దాచడం అనే భయము కలిగింది. ఎప్పుడోప్పుడు ఎట్లాగూ తెలుస్తుంది. తెలిసిం తరవాత యెట్లాగూ యింట్లోంచి తరుముతారు. ఎక్కడకి పోవడం—యీపిల్లని; యీ పిల్ల పిల్లని పెట్టుకుని ఎట్లా బతకడం?...కుళ్లి యేడుస్తోంది.

తన స్థితి సుందరమ్మకి చాలారోజుల కిందటే తెలిసింది. బెంగపడి ఏడ్చి లాభం లేదనుకుంది. తన రక్తంలో వున్న కర్మసిద్ధాంతాన్ని సహాయం తీసుకుని పలక్కుండా వూరుకుంది. చిన్నతనంలో ఆపదలు ఎక్కువబాధ పెట్టవు; మనసు ఏదో ఒక సంతోషముతో వుండి ఆపదను మరిచి పోతుంది. చిన్నతనంలో వున్నవాళ్ళని, తన పూర్ణవికృత భీకరస్వరూపంతో అనుభవంలోకి రాకపోవడంవల్ల రాబోయే ఆపదలు బాధలు భయపెట్టవు.

తనభర్తకి ద్రోహంచేశానని సుందరమ్మకి బాధపట్టుకుంది. భర్తని అమితంగా ప్రేమించింది. అతను చనిపోతే చాలా ఏడ్చింది. కృతజ్ఞతవల్ల, ప్రేమవల్ల జన్మంలో అతన్ని మరిచిపోననీ పోకూడదనీ అనుకుంది. అతనికి అపరాధం ఎన్నడన్నా చేస్తానేమో అనే ఆలోచనే రాలేదు. చెయ్యగల పరీక్ష సంభవిస్తుందనే తోచలేదు. కాని కాలక్రమేణా అతని రూపము, ధ్యాసా, అతని కోసం దిగులూ, ప్రేమా మాసి పోయినాయి. ఆమరుపు కృతఘ్నత అనీ, నీచత్వం అనీ తనని తానే నిందించుకుంది. దుష్టురాలననీ, చపలచిత్తురాలననీ, అంత వున్నత ప్రేమకు అనర్హురాలననీ తనని తాను తిట్టుకున్నది. తన కామోద్రేకంలో తన నియమాన్ని దాటినందుకు ఆయనకు శాశ్వతంగా చెందిన తన శరీరాన్ని — అర్ధాంగాన్ని పరపురుష స్పర్శతో మలినం చేయనిచ్చినందుకు తనని తాను అమితంగా ద్వేషించుకుంటోంది.

తనని నమ్మి యింకోలోకంలో కలుసుకుంటానని వాగ్దానంచేసి చనిపోయిన భర్త తనదోషాన్ని తెలుసుకుని విచారంతో కుంగిపోయినట్టు, ఆమె

కలల్లో, చీకట్లో, పక్కదగ్గిరా కనబడుతున్నాడు. ఏడుస్తో చూస్తాడు. కోపంతో బెదిరిస్తాడు. పక్కచుట్టూ తిరుగుతున్నాడే అనుకుని బిగ్గిరగా తన హృదయమంతా విప్పి చెప్పింది.

మెల్లిగా ఏడ్చింది. నమస్కరించింది. క్షమించమంది. బ్రతిమలాడింది. లాభమున్నట్టు తోచలేదు. చచ్చిపోవాలని నిశ్చయించుకుంది. ఆ పరిహారం వల్లనేగాని తన పశ్చాత్తాపాన్ని తెలియచెయ్యడానికి వీల్లేదు అనుకుంది. తన దగ్గిరకి వొచ్చినందు కాయన సంతోషిస్తాడు. వొంటరిగా అట్లా తనవెంట తిరుగుతో వుండడు. కాని తనని నిరాకరిస్తాడేమో! పోనీ తన తల్లికి దుఃఖం, దిక్కులేని స్థితివచ్చి మాడడం అవమానం, ఇన్నీ వస్తాయి. మళ్ళా చావంటే భయం. ఆత్మహత్య అంటే ఘోరమయిన పాపం అని నమ్మకం. దెయ్యా లవుతారని భయం. అయితే దానంతట చావు వొస్తే బావుండును. చంప మని దేవతల్ని భర్తనీ ప్రార్థించింది. అపాయకరమయిన స్థలాలకు వెళు తుంది. బావి అంచున నడుస్తుంది. కత్తిపీటమీద పడబోతుంది. దీపంమీద కుచ్చెళ్లు తగిలించబోతుంది. భయమయి వూపిరి బిగించుకుంటుంది.

మూడో నెలలో సుందరమ్మ వ్యవహారం యింటోవాళ్ళకి తెలిసి గుస గుసలు ప్రారంభించారు. త్వరలోనే వెంకట్రామయ్యగారి నోటీసులోకి వెళ్ళింది. ఆయన జీవితాన్ని గురించీ, జీవితంలో అనవసరమయినవీ లాభం లేనివీ అయిన చిరాకుల్ని గురించీ చక్కగా ఆలోచించిన మనిషి. కష్టాలు కలిగినప్పుడూ, నష్టాలు కలిగినప్పుడూ ఏడుపులూ, తిట్లూ, ఇతరులమీద నింద మోపడాలూ అవివేకమని ఆయనకు తెలుసు. ఒకప్పుడు బ్రహ్మసమాజంలో పడబోయే అపాయం తప్పించుకున్నాడు. ఆచారాల మాహత్వం, అర్థవిహీ నత్వం తెలుసుకున్న తరవాత వాటిని అనుసరించినా ఒకటే అనుసరించక పోయినా ఒకటే! అనుసరించక తన బంధువులకీ స్నేహితులకీ దూరమయి తల్లికీ భార్యకీ ఆజన్మాంతం విరోధి అయి, వాళ్ళు ప్రేమించా లనుకొన్నా ప్రేమ చూపలేని స్థితిలోకి పోవడం మూర్ఖమనుకున్నాడు. లోకాన్ని దాని తోవన దాన్ని పోనీక తనదోవకి తిప్పాలనే వెర్రి ఆశ అతన్ని పీడించలేదు.

ఈ ప్రస్తుత వ్యవహారంలో కర్తవ్య మేమిటి? అని యోచించాడు. ఎవర్ని తిట్టీ ఏమీ లాభం లేదు. జరిగింది జరిగింది. యవ్వనంలో పిల్లపొరబాటు పని చేసింది. పిల్ల అల్లాంటి ఆపదలో పడకండా జాగ్రత్త తీసుకోకపోవడం

పెద్దవాళ్ళ తప్పు. సుందరమ్మ తల్లిని పిలిచి ఆమెకు తెలిసిన విషయాలు చెప్పమన్నాడు. ఆమె ఊరికే ఏడవడమూ — తన కూతురి దుర్బుద్ధిని తిట్టడమూ తప్ప ఏమీ చెప్పలేదు. ముందు కసిరి ఏడుపు మానిపించాడు, తిట్టడం మానమన్నాడు, "మీరు చూసిన విషయం చెప్పండి" అన్నాడు.

"నేనేమీ చూడలేదు. చూస్తే వూరుకుంటానా?...అది అల్లాంటి పిల్ల కాదు. దాని కేదో దయ్యమో......"

"పొద్దస్తమానమూ సుందరమ్మతో వున్న మీరే చూడలేదంటే మీకు కళ్లు లేవన్నమాట. ఇట్లాంటిది ఒక నిమిషంలో జరిగే పని కాదు...సుందరమ్మ బుద్ధిమంతురాలు; మంచి మనస్థైర్యంకలది. అట్లాంటప్పుడు పొరబాటున తటాలున జరిగివుండదు మీరే తెలివిగా చూసివుంటే యీ ఆపద తప్పించి వుందురు. ఆపిల్లనుతిట్టి ఏం ప్రయోజనం? వినండి, ఇప్పుడు మనం చేయకలిగింది ఒకటేపని. దీనికి ఎవరు కారణమో వాణ్ణి తెలుసుకుని, ఇద్దరికీ పెళ్ళిచేద్దాము".

"పెళ్లీ! ఏమిపెళ్లీ!! కొంప ముంచారు."

"నేను ముంచే దేముంది. కొంప యిదివరకే మునిగింది. నేను లేవనెత్తాలని చూస్తున్నాను...మీగతి ఏమవుతుంది? నాకు అభ్యంతరం లేదు. కాని నా భార్య మిమ్మల్ని యింట్లో నిలవనీదు. నా బలవంతంమీద వుండనిచ్చినా యిక్కడ మీ బతుకు అతి నీచమవుతుంది. ఆ కూతుర్నీ మనమరాల్నీ పెట్టుకుని ఏమవుతారు మీరు? ఇకముందు ఆపిల్ల గతేమిటి?....ఎవరెవరి చేతుల్లో పడుతుందో? ఏగతికి వస్తుందో? లోకమంటే ఎరగదే ఆపిల్ల పాపం! లోకం సంగతి తెలిస్తే — తెలిసేటట్లు పెంచివున్నట్లయితే యిట్లా అధోగతి పాలయ్యేదా ఆపిల్ల! వెళ్ళండి. ఎట్లానయినా వాడిపేరు సంపాయించండి," అన్నాడు వెంకట్రామయ్య.

కాని ఆమె మళ్లీ ఆయనదగ్గరకు పోలేదు.

సుందరమ్మనే పిలిపించాడు. "అమ్మా, రా, యిట్లా కూచో. ఎట్లా వున్నావు?......ఏమన్నా చదువుకుంటున్నావా? ఆ వెధవ చంద్రశేఖరం వెళ్ళినప్పణ్ణించీ ఎవరూ చెప్పేవాళ్లే లేరనుకుంటాను," అంటూ ఆమె ముఖంవంక జాగ్రత్తగా చూస్తున్నాడు.

అనుమానం నిశ్చయమవుతోంది. వాడు మాయ మవడానికి కారణం యింకేముంటుంది?......

"నీకు అవస్థ వొచ్చిందని దిగులుపడకు. ఏడ్చి లాభంలేదు. కాని మళ్ళీ యిట్లాంటిది జరగకుండా వివేక పడు! ఇట్లా మళ్ళా జరిగితే నాశనమయి పోతావు. ఇప్పుడు నీకు సహాయం చెయ్యాలనే ప్రయత్నిస్తున్నాను. జరిగినదానికి వీలయినంతవరకూ పరిహారం చెయ్యాలి...మరి ఒక్క ప్రశ్నకు జవాబు చెప్పు...ఎవరు ?"

సుందరమ్మ మాటాడలేదు. నాలుగయిదు సార్లు బతిమాలాడు. "నన్నడక్కండి." అని నిశ్చితంగా అన్నది. ఆమె హృదయ ఔన్నత్యాన్ని అర్థం చేసుకుని వూరుకున్నాడు.

"చంద్రశేఖరమే అయితే యింత గొప్ప ఆత్మగల పిల్లని ఆనీచుడికి కట్టి వెయ్యడానికి ఆయన మనస్సు వొప్పలేదు. కాని యింకోగతి ఏది? యీ క్రూర ప్రపంచంలో ? ఇట్లా జీవుల్ని ఒక అధోగతినించి యింకో అధోగతికి యీడుస్తోంది యీ ప్రపంచం. సుగుణాలు వున్నకొద్దీ గాయపడుతున్నారు ప్రజలు. ప్రతివాడూ కన్ను వేసి వాంఛించే యవ్వన శోభనూ, సహజమయిన స్త్రీ కాంక్షను కల్గించి సృష్టివుద్దేశం నెరవేర్చే గర్భాన్ని కల్పించి, ఆ కారణాలతోనే అధోగతికి లాగి బహిష్కరించి, ద్వేషించేట్టు చేసి, నలిపి, నరకంలో తోసేది, బుద్ధీ దయా గలిగిన దేవుడేనా ?" అనుకున్నాడు.

"ఆ యీశ్వరుడికేమీ జోక్యంలేదా ? మానవులే యీ సంఘనీతులను కల్పించింది !...ఆ నీచుడికి యీ ధీరురాల్ని కట్టడంకన్న వేరుగతి లేకుండా చేసింది యీలోకం. పాపం ఆ వీరేశలింగంగారి వల్ల యీమాత్రం మార్గం లభించింది, ఈ ఆంధ్రలోకానికి ! లేకపోతే యేంచెయ్యాలి యీసుందరమ్మని, గొంతుపిసకడం తప్ప" అని అనుకున్నాడు. ఆలోచించాడు. ఏమీ తోచలేదు.

"ప్రస్తుతం యీపిల్ల గతేమిటి ? యీచేత్తోనే యీ ఘాతుక కార్యం చెయ్యాలి కాబోలు. మార్దవాన్ని చంపుకుని కఠినత్వం వహించాలి. ఏకార్యమయినా చక్కగా సాధించి ప్రయోజకుడు కావాలంటే, యితరులకు వుపయోగపడి సౌఖ్యం కలిగించాలంటే మనుష్యుడు తన అంతరాత్మనీ, కారుణ్యాన్నీ, న్యాయబుద్ధినీ, యుక్తాయుక్త వేచననీ చంపుకోవాలి. ఏ వితంతువుల మీద దయచేత ఆ వీరేశలింగం పంతులు త్యాగం చేశాడో ఆయనే ఆ వితంతువుల్ని సర్కసు జంతులవలె క్రూరడాతో పాలించక దయదలిస్తే ఒక్క వివాహం చెయ్యగలిగి వుండేవాడా? దయదలచి సామాన్య మానవత్వంతో

సాభాగ్యతుత్వంతో చూశామా యీ వితంతు శరణాలయాలూ, బోర్డింగులూ ఒక్కదినం నిర్వహించడానికి సాధ్య మవుతుందా?" అనుకున్నాడు.

ఇక చంద్రశేఖరాన్ని వెతికి పట్టుకుని రావడానికి నిశ్చయించుకున్నాడు. అతని పల్లెటూరూ, బంధువుల పల్లెటూళ్ళూ వెతికించి వెతికించి చివరికి ఆయనే సరాసరి ఆవూరు వెళ్ళాడు. చంద్రశేఖరం హఠాత్తుగా వెంకట్రామయ్య గారి కళ్ళ పడేటప్పటికి అతను నివ్వెరపోయినాడు.

"అంతా తెలిసింది" అన్నాడు వెంకట్రామయ్య.

"ఏమిటి ?"

"ఇంకెందుకు ? సుందరి చెప్పింది."

ఏమంటాడు, చంద్రశేఖరం. గుడ్లు మిటకరించాడు.

"నువ్వు చేసినపని న్యాయం కాదు."

అతను తల వేళ్ళాడ వేశాడు.

"నేను నీకు చేసిన మేలుకి చాలా మంచి ప్రత్యుపకారం చేశావు. ఇప్పుడు నిన్ను ఖయిదులో పెట్టించగలను. నీ హత మార్చగలను."

వెంకట్రామయ్యగారి సామర్థ్యంలో చంద్రశేఖరానికి అమితమయిన విశ్వాసం వుంది. అందులో అతనికి 'లా' అంటే ఏమిటో అసలే తెలీదు. చంద్రశేఖరంవంటి వాళ్ల విషయంలో వాళ్ళ ధర్మబుద్ధికి 'అప్పీలు' చేసిలాభ ముండదని వెంకట్రామయ్యగారికి తెలుసు. వాళ్ల పిరికితనానికి వేడితగిలించాలి.

"నువ్వుగనక నిజంగా పశ్చాత్తాప పడితే క్షమిస్తాను." అన్నాడు.

వొణికిపోతున్న చంద్రశేఖరానికి గుండె కుదటపడ్డది. అతను వెంకట్రామయ్యగారి కాళ్ళమీదపడి యేడ్చి క్షమించమన్నాడు.

"నిశ్చయమేనా ?"

"చిత్తం...పరిహారం సెలవీండి......నా ప్రాణం కావాలన్నా సరే"

"నువ్వు చేసిన పని ఎంతఘోరమో, నీచమో, తెలుస్తోందా ?"

"ఆ"

"ఆ పిల్లగతి ఏంకాను ? జాలిలేదా ?"

"ఉంది. బుద్ధి తక్కువ పని చేశాను."

"ఆ పిల్లని ఏవిధంగానన్నా రక్షించగలిగితే ఆపని చేస్తావా ?"

తన మెడయేదోవుచ్చులో దూరుతోందని అనుమానం కలుగుతోంది. కాని

భయమే విజృంభించింది. "చిత్తం,. అట్లాగే చేస్తాను." అన్నాడు చంద్రశేఖరం.

"ప్రమాణం చెయ్యి."

ప్రమాణం చేశాడు. "అయితే వ్రాసి యియ్యి" అన్నాడు, అతను తాను చేసిన పని సంగతీ, పశ్చాత్తాప పడుతున్నాననీ వ్రాశాడు. టీచరు ట్రెయినింగ్ కాకపోతే అతనట్లా వ్రాసి యిచ్చేవాడు కాడు.

"సుందరమ్మని పెళ్లిచేసుకో."

"పెళ్లి! ఎట్లా?"

"ఏతంతు వివాహం."

ఏమీ అర్థంకాకుండానే "సరే" నన్నాడు. చంద్రశేఖరం బంధువుల్నీ స్నేహితుల్నీ చూసే వ్యవధికూడా యియ్యకుండా అతన్ని వెంట బెట్టుకుని బెజవాడకు తీసుకుని వచ్చాడు.

చంద్రశేఖరం మళ్ళీ యింటికి ఎందుకు వొచ్చాడో సుందరమ్మకి అర్థం కాలేదు. పెళ్లిముహూర్తం నిశ్చయమయి అన్ని యేర్పాట్లూ జరిగే దాకా ఆమెకేమీ తెలీనేలేదు.

రోగికి యెంత బాధకలిగించ పోతున్నాడో తెలిసి యింక గతిలేక రోగికి తెలీకండా ఆపరేషన్‌కి తయారుచేసే డాక్టరులాగా పెళ్ళికి యత్నాలు చేయిస్తున్నాడు, వెంకట్రామయ్యగారు. తనకు పెళ్ళిచేస్తారని తెలిసిందన్న మాటే గాని ఆమె వుద్దేశం అడిగిన వాళ్లు ఎవరూ లేరు. తనే కలుగజేసుకుని మాట్లాడడానికి సిగ్గు. తల్లికి అసలు ఏమీ తెలీనట్టే వుంది. వెంకట్రామయ్య గారు అసలు కనపడడం మానివేశారు.

ఆ చంద్రశేఖరం మీది పరమ అసహ్యం ఆమెని బాధిస్తోంది. తాను తన వాళ్ళకి కలిగించిన వ్యసనానికి ఎంతో బాధ పడుతోంది. తన గర్భంవల్ల కలగబోయే ఆపదలుకూడా క్రమంగా తడుతున్నాయి. సందేహాలతో కర్తవ్యం తెలీక సలహా యిచ్చేవాళ్లు లేక లోకంలో వొంటరిది అయిపోయి వొణుకుతో బిక్క మొహంతో సుందరమ్మ పెళ్ళికూతురయింది రెండోసారి.

పెళ్ళి కాగానే చంద్రశేఖరానికి ఆవూళ్లోనే బాంకిలో వుద్యోగమిప్పించి కాపరాన్ని యేర్పరిచి తన చేతులు దులుపుకున్నాడు వెంకట్రామయ్య. పెళ్ళికూడా తనకేమీ సంబంధం లేనట్టు దూరాన్నించే చేయించాడు.

ఇక సుందరమ్మ తల్లి ఆవూరే వొదిలి యాత్రలకు వెళ్ళిపోయింది.

## ౬

కాపరం ప్రారంభించిన వారం రోజుల్లో చంద్రశేఖరం తరహా మారింది. తన పోషకుడూ ధనవంతుడూ అయిన వెంకట్రామయ్యగారి మేనకోడలు— తనకి అందని వేగుజుక్క—ఆమె ఒక్క కిరణం తనమీద ప్రసరిస్తే తన జీవితం ధన్యమవుతుం దనుకున్నది - ఆమె తలంపులతో సంబంధించిన భావాలన్నీ ప్రబంధాల్లోంచి ఏరుకున్నవి - అతని దృష్టి ఆమె సౌందర్యంమీదా — అతని ఆశ ఆమె కరుణమీదా—నిలిచాయి అప్పుడు. ఇప్పుడా సుందరమ్మే అతని భార్య అయింది. తాను దూరాన్నించి చూసి, మురిసి, తామర పువ్వులతో పోల్చి భ్రమిసి వర్ణించిన ఆమె చేతులు తనని తాకగానే తన వొళ్ళంతా పులకరింపచేసిన ఆమె వొళ్ళు—ఇప్పుడా చేతులే ఆ వేళ్ళే కాయలు కాసేట్టు రుబ్బుతున్న కందిపచ్చడి రుచిమీద నిలిచింది అతని మనస్సు. ఆమె చర్మపు బంగారు మనుపుకన్న ఆమె అంట్లు తోమకపోతే దాసిదానికి కర్చయ్యే వెండిరూపాయి యెక్కువ విలువ గలదయింది.

అతను ఆమెను ప్రార్థించడం ఆమె దయని పొందడం అనే భావమే పోయి తనకి ఆమె చేసే సేవల్లో లోపం చేస్తున్నదే, గౌరవం చెయ్యడం లేదే, తన కోపానికి ఆమె జడవడం లేదే, అనే ఆలోచనలు కలుగుతున్నాయి.

ఆమెచేత ఎన్నివిధాల సేవసేయించుకోవొచ్చో, ఆమె శరీరకష్టం వల్ల తానెంత రుచి పొందవచ్చో, యోచిస్తున్నాడు.

దరిద్రుడు అకస్మాత్తుగా ధనవంతుడయితే దుబారా కోరన్నా అవుతాడు, లేక పిసినగొట్టుగా నన్నా మారుతాడు. పదిహేను రూపాయల జీతం దొరికితే మహాభాగ్య మనుకున్న చంద్రశేఖరానికి యిరవై అయిదు రూపాయల గుమాస్తాగిరి చాలా అదృష్టంగా తోచింది. జీవితమంతా పల్లెటూరి బడిపంతులనే మహా కూపంలో నివసించడానికి సంసిద్ధుడయిన అతనికి యీ ప్రపంచ ద్వారాలే తెరుచుకుని గొప్ప జీవితాలకూ పదవులకూ ఆహ్వానిస్తున్నట్టయింది. తన పాతస్కూలు టీచర్లకు నమస్కరించే అవసరం లేకుండా వీధుల్లో, దుకాణాల్లో సరిసమానంగా తిరగగలగడం అతనికి గొప్పగా వుంది. తన ఆచారాన్నీ సనాతన పద్ధతినీ వొదులుకున్నందుకు తాను చాలా తెలివి

గల పని చేశానని ఆనంద పడ్డాడు. సుందరమ్మతోటి తన పూర్వ సంబంధం లోని సౌందర్యం మరిచిపోయి అదంతా తన పురోవృద్ధికి తాను వివేకంగా చేసిన యత్నమని గర్వపడుతున్నాడు.

గొప్ప పదవుల్ని యితరుల అనుగ్రహంవల్ల సంపాయించిన వాళ్లు ఆ అనుగ్రహించిన ఉపకారుల్ని త్వరలో మరిచిపోవడానికి ప్రయత్నిస్తారు. కృతజ్ఞతా భారాన్ని మనుష్యస్వభావం భరించలేదు. కనక తమలో వున్న ఆధిక్యతే తమ కాపదవిని యిచ్చిందనీ, అనుగ్రహాన్ని సంపాయించిన తమ వివేకమే తమకి సహాయం చేసిందనీ సమరించుకుంటారు. తరవాత త్వరలోనే తమ జాతకమో—అదృష్టమో, తాము కొలిచిన దేవతో, తమ కా పదవి నిచ్చిందని సమరించుకుని తమమీది అభిమానంచేత తమకి యితరులు సహాయం చేశారనే సంగతిమాత్రం మనస్సుల్లోంచి వొదిలించుకుంటారు. అట్లానే చంద్రశేఖరం కృతజ్ఞతను మరిచి వెంకట్రామయ్యగారు తమ విధ్యుక్త ధర్మ ప్రకారమే తనకు పని యిప్పించారనీ సుందరమ్మని పెండ్లిచేసుకోడం ఆయనకి వుపకారమనీ పయిగా తానే మామూలు పెళ్లి చేసుకుంటే తాను గుమాస్తా గనక నాలుగయిదు వేలు కట్నం వచ్చివుండేదనీ తనకి అయన ఒక్క ఐదు వందలయినా చివరకి ఒక్క బైసికిలన్నా యిచ్చాడుకాదనీ అనుకుంటున్నాడు. ఎట్లానయినా ఆయన దగ్గిర్నించి ఆ విలవ రాబట్టాలి. తనకు జన్మలో పెళ్లికి పిల్ల దొరుకుతుందా, పాలఘాటుపిల్లను చేసుకునేట్లయితే వెయ్యిరూపాయలు యెన్నేళ్ళకి పోగవుతాయి, అని తాను దిగులుపడ్డ రోజులు జ్ఞాపకంలేవు.

అదిగాక యీ వచ్చే యిరవైఅయిదు రూపాయలలో సగం సుందరమ్మ చీరలకి భోజనానికీ ఖర్చయితే తనకు మిగిలే లాభమేమిటి? సంసారం డబ్బుమీద ఆధారపడడంవల్ల సంసారసుకు—వాళ్ల ప్రేమ, వాళ్ల అందం—వాళ్ల నవ్వులు—అన్నీ డబ్బుల లెక్కలమీద ఆధారపడతాయి—వూరికే వొచ్చే ఎండా వెన్నెలా అందంగా కనబడట్టు ఎలెక్ట్రిక్కు దీపాలు కనబడవు. దృష్టిఅంతా ఖర్చవుతున్నదన్న డబ్బుమీదే వుంటుంది.

అట్లానే సుందరమ్మ మీద ప్రేమా, ఆమె అందంలో ఆనందం, అన్నీ పోయి ఎంత భోజనముకు ఖర్చు అవుతుందో, ఏ చీర ఆమెకి అందంగా వుంటుందో దృష్టిపోయి ఎంత చవకలో చీర కొనవచ్చుననే ఆలోచనే

వొస్తోంది. ఆమె తిరుగుతూ వుంటే ఆమె చక్కని బుజాలని కప్పే పమిట విసురుని చూడడం బదులు దేనికన్నా పట్టుకుని చిరగదు గదా, సరిగా పక్కకి దోపుకుంటే నేం అనుకుంటాడు.

తన తోడు-నీడ, తన భార్య—సహధర్మచారిణి తనని నమ్మి కష్టసుఖాలు తనతో పంచుకోడానికి వచ్చిన సుందరమ్మమీదకన్న, తనతో రహస్యంగా—ఆయిష్టంగా వ్యభిచారం చేసిన సుందరమ్మ మీద అతనికి గౌరవం యెక్కువ, అతనికే కాదు; అందరికీ అంతే. అది పవిత్రవివాహ ఫలితం.

పూర్వం—వివాహం కానప్పుడు మొదట్లో సుందరమ్మగారూ అని పిలిచాడు. మోహించిన తరువాత 'సుందరీ—త్రిలోకసుందరీ—మృదుపద్మగంధ సుందరీ' అని సొంత కవిత్వం పెట్టాడు. పెళ్లి అయిన క్రొత్తలో 'ఒసేవ్—ఏమేవ్' అన్నాడు. వారంరోజు లయ్యేసరికి గాడిదా, కళ్ళు లేవుటే—ఈ పచ్చడిలో యింత కారం తగలేశావేమే—నీ తెలివి తగలడ' అని యింకో రకం కవిత్వం ప్రారంభించాడు.

"గొప్పయింటి పిల్లని చేసుకున్నప్పుడు మొదటినించీ అధికారం చూపకపోతే నెత్తిన యెక్కుతుంది. తరువాత భార్యకి చనువిస్తే తన చిక్కులకి అంతం వుండదు" అని, తనే లోకంలో మొదటిసారి ఆసంగతి కనిపెట్టినట్టు అనుకుంటున్నాడు. అన్నిదిక్కులా, ఎక్కడ చూసినా "నేను—నాది—నాభారం—నాస్వంతం—నాబాధ్యత" అనిపిస్తోంది. ముఖ్యంగా ఉద్యోగం, తరవాత యిల్లు—ఒకచోట బాధ్యత ఇంకోచోట అధికారం. తాను ఆఫీసులో బానిస. ఇంట్లో సుందరమ్మ తన బానిసఅంటే బానిసకు బానిస. లోకమంతా ఒక సిష్టం-అధికార్లూ-తాబేదార్లూను. గృహమో అంతే. ఈ ఉద్యోగంపోతే తనకి దిక్కులేదు. కనక యే ఆజ్ఞనూ-యే పరాభవాన్నీ న్యాయంకాని అన్యాయంగాని భరించాలి. తనని మనిషినిగా కాకండా మరలాగ చూచి రాత్రింబవళ్ళూ పనిచేయిస్తే చెయ్యాలి. సాయంత్రం యింటికి పోనిస్తే, ఆదివారం ఆఫీసుకి రానక్కర్లేదంటే, అది అధికార్ల దయ.

లోకంలో చాలామంది మనసులూ, ఆత్మలూ, యిట్లా మరలో పెట్టి వొత్తిన పుస్తకాలవలె అణిగిపోతాయి. "పని-పని-పని" యింతపని-ఆత్మల్ని పిండి, ఆనందాన్ని నశింపచేసి, మనుష్యుల్ని మరలుగా చేసి నీచుల్నీ బానిసల్నీ చేసే యింతపని! యీ ఆనందమయ జీవితంలో యింతపని అవసర

ముందా ?—చివరికి అంతపనీ మనుష్య స్వభావానికే అవసరమని గొప్పవారు కూడా అనే స్థితికి వొచ్చింది ప్రపంచం.

ఈ భావాన్నే చంద్రశేఖరం తన సంసారంలోకి తీసుకొచ్చాడు. తానింత కష్టపడుతో వుంటే తానింత బానిస అయిపోతే తన కష్టార్జితం మీద ఆధారపడుతో తన రూపాయల్ని తరుగుచేసే మనిషి తనకన్న యెందుకు తక్కువ కష్టపడాలి! ఆమె తన మాటకి యెదురు చెప్పినట్టు తను ఆఫీసులో ఎదురు చెపితే!...తను మాటల్ని నిర్లక్ష్యంచేస్తే డిస్‌మిస్ కదా!...మరి తను యీమెని డిస్‌మిస్ చేస్తే?...చాలామంది భార్యలు దొరుకుతారు. తన కిప్పుడు బాంకిగుమాస్తా పని!! ఇరవై—పైగా ఐదు రూపాయల జీతం. వితంతు శరణాలయం నిండా కులుకులాడుతో మగవాడు కలబడితే చాలునని కిటికీల్లోంచి ఆత్రంగా లోకాన్ని వెతికే—కామాగ్నిలో దహించుకుపోయే-వితంతువులు ఎంతమంది లేరు?...దీన్ని తరిమేస్తేనేం...వెంకట్రామయ్యగారు తన పని తీసివేయించగలడా? హెడ్ గుమాస్తా-ఆయన పనినంతా చూసిపెట్టే తనలాటి గుమాస్తాను వొదిలి పెడతాడా ?...

అనాథ—దిక్కు—లేదు-తలిదండ్రులు లేరు. వున్నా కనికరించరు. డబ్బు లేదు. సంపాయించుకో లేదు...అది తలచుకున్నప్పుడల్లా చంద్రశేఖరానికి తన గొప్పతనం వెల్లడి అవుతో వుంటుంది.

అధికార్లకింద త్వరలోనే తరిఫీదయి, మజ్జిగలో చీమ పడిందనీ, తన చొక్కాకి కుట్టుపక్కకు వొచ్చిందనీ, స్నానానికి నీళ్ళు వేడిగా లేవనీ తిడుతున్నాడు చంద్రశేఖరం సుందరమ్మని. పీట తగిలితే ఎందుకు ఆ పీటని దోవలో వుంచావంటాడు. 'అజాగ్రత్తగా వుంటే తగలదా' అని సుందరమ్మ అంటే ఎదురుచెప్పడం అంటాడు. ఒకరిమీద ఆధారపడడంలోనే వుంది యీ నీచత్వం!

కొద్దిరోజుల్లోనే అతనికి సుందరమ్మ మీద అనుమానం యేర్పడ్డది. ఆమె స్వభావాన్ని గుర్తించలేక పోయినాడు. తనకు ముందు యెందర్ని మోహించిందో—తను అజాగ్రత్తగా వుంటే యింకెందర్ని మోహించి తనని మోసం చేస్తుందో అనే అనుమానం పుట్టింది. తన భార్యని యితరపురుషుడు తాకుతాడేమోననే పౌరుషమే గాక, తను కష్టపడి సంపాయించిన ఆస్తిని ఏమీ ఖర్చు లేకండా యింకోడు అనుభవిస్తాడే అనే బెంగా, లేచిపోయి తనను

నవ్వుల పాలు చేస్తుందేమోననే [illegible]యమూ పట్టుకుంది. ఆమెకి తనమీద యిష్టం లేకపోయినా తన దొంగవే[illegible] వెర్రిది లోబడ్డది కదా! [illegible]డు ఆ వేషాలే వేస్తే?...ఆమెకి తనమీ[illegible] ప్రేమ వున్నట్టే వుం[illegible]కపోతే ఎందుకు పెళ్ళి చేసుకుంటుంది?...కాని [illegible] ప్రతిభ అనే మరి[illegible]లేదా?...

ఆమెఅందమే అతనికి పరమ శత్రువయి పోయింది. ఎంత ముసలివాణ్ణిగాని, నీతిపరుణ్ణిగాని—ఆడవాళ్ళని సహితం 'ఏమి అందమా' అని నిలుచో పెట్టగలది సుందరమ్మ ఠీవి. ఎవరు ఆ అంగాన్ని మాటలతోగాని కళ్ళతో గాని మెచ్చుకున్నా అతనికి విషాదం ఎక్కువవుతోంది. పెరుగు మనిషి "ఎంత అందమైన దానివమ్మా! మీ దేవూరు" అంటుంది. కట్టెలు వేసిన వాడు ఆశ్చర్యంతో మైమరిచి యెవరో దేవతని చూసినట్టు ఆమెవంక చూస్తో నుంచుంటాడు.

తన భార్యకి యింత అందం యెందుకు? తనకి పనిచెయ్యడానికీ, యిల్లు కనిపెట్టుకుని వుండడానికీ యింత అందం యెందుకు? ఎవరో మేడల్లో పహరాలు పెట్టుకుని గాచుకో గలవాళ్ళకిగాని తనకెందుకు యీ అందం? దీపం పెట్టుకో డబ్బులేనివాడికి పెద్దమేడ లభించినట్టు వుంది.

తన పరువెప్పుడో కూలదోస్తుంది. ఇంత అందం ఆగదు. ఎవరన్నా కావలి వుంటే బావుండును. తన తల్లిమీద చప్పున ప్రేమ కలిగింది. అన్ననీ తల్లినీ వొదిలి ఎప్పటినించో ఎక్కడెక్కడో చదువుకున్నాడు చంద్రశేఖరం. ఇప్పుడామెని ప్రేమతో పిలిస్తే?...ఈ వివాహం ఆమె అంగీకరించలేదు. ప్రయత్నించి తీసుకు రావాలి. కొంత కుదటపడుతుంది గుండె! కాని ఆమె భోజనం యెక్కడ చేస్తుంది?...ఈ ఆలోచనతో తల్లిమీద ప్రేమ యెక్కువయింది.

ఈ సుందరమ్మ తననీ తన బంధువుల్నీ విడతీసింది. తనను మోహంలో ముంచి మోసపుచ్చి వెలిలోకి దింపింది. తనకేమి లాభం—యీ అందం? ఎందుకిది? ఒక పండుగలేదు. అత్తవారు తీసుకెళ్ళడం లేదు. బట్టలు పెట్టడంలేదు మోహించి అనుభవించినంత మాత్రం చేత ఆడవాళ్ళని పెళ్ళి చేసుకుంటున్నారా అందరూ?...నీతిపరుడు గనక తాను వొప్పుకుని పెళ్ళి చేసుకున్నాడు, సుందరమ్మ భర్త బతికివుంటే బావుండేది. అప్పుడు యీ పెళ్ళిచేసుకునే అవసరం తప్పిపొయ్యేది. దయదలిచి తాను చేసుకోకపోతే దీనిగతి ఏమయ్యేది? పయిగా గొప్పదానిలాగా నీలుగుతుంది.

భార్యలో స్వేచ్ఛనీ, తన కర్ధంగాక తనకి లోబడక మిగిలిన స్వభావాన్నీ క్షమించలేడు పురుషుడు. ముఖ్యముగా సుందరమ్మ సహజ ధిక్కారాన్ని సహించలేకండా వున్నాడు చంద్రశేఖరం ఎంతగాయం చెయ్యాలా, ఎట్లా తనపాదాల మీదపడి కరుణించమని యేడ్చేట్టు చెయ్యాలా, అని ఆలోచిస్తున్నాడు.

సుందరమ్మకి మొదటినించి యీ కాపరం కంటకంగానే వుంది. చంద్రశేఖరాన్ని చూస్తే ఆమెకి ప్రేమలేదు. అటువంటివాణ్ణి ప్రేమించడం స్వభావ విరుద్ధం. అతనితో కలిసివుండడంవల్ల, అతని బోధనలవల్ల, బాధవల్ల కొన్ని ఏళ్లకి క్రమంగా ఆమెస్వభావంకూడా నీచత్వం పొందితే అప్పుడు ఒకటే ఆశయాన్ని ఆరాధించడంలో యిద్దరూ అయిక్య మవుతారు. అంతవరకూ తృణీకారం ఆమె మానలేదు. అతని దౌర్జన్యం ఆమెకి కష్టం కలిగించింది. కాని, ఆశ్చర్యం కలిగించలేదు. తనవంశపు పూర్వవనితల అణకువా, సత్ప్రవర్తనా మొదలయిన గుణాలు ఆమెలో యిమిడి పోయినవి.

ఈ జన్మకి తనగతి యింతేనని సర్వమయిన ఆశలూ వొదులుకుని ఒక విధమయిన జడత్వం పొందిందామె. ఇదే ధర్మమనే సులభమయిన నమ్మకం ఆమెకి సహాయం చేసింది. భర్త యెటువంటివాడో అనే ప్రమేయమే లేదామెకు. అగ్నికి వేడీ, తేలుకు కుట్టే స్వభావమూ ఒకరు కల్పించినవి కావు. భర్త స్వభావమూ అంతే. అనుభవించవలసిందే గాని అనుకుని లాభం లేదు. ఇక ఏప్రయత్నమూ లేదండా దిగులు పడకండా నిశ్చలత్వమూ, విరక్తీ అనే కవచంతో వుంది సుందరమ్మ.

కాని ఎవడు మొన్నటిదాకా తనకన్న కింద మెట్టుమీద నుంచున్నాడో, తన దయకోసం తన అంగీకారం కోసం పరితపించి కాళ్ళు పట్టుకున్నాడో వాడు యీనాడు తనకధికారి అయి, తనని ఆజ్ఞాపిస్తే మహారాణిలాగా ఎవడికి తాను మోహవరాలిచ్చిందో వాడు ప్రభువయి తన హక్కయిన అమూల్యానందాన్ని లాక్కుంటే ఆమె శరీరం మీదనే ఆమెకి అసహ్యం కలిగింది. అతని అధికారమూ, అనుమానమూ, నీచపరిహాసమూ, ఆమె నెంత బాధించినా పవిత్ర బ్రాహ్మణ కుటుంబాలలో ఆటువంటి దౌర్జన్యాలు సాధారణంగా వుంటాయని ఆమెకి తెలుసును గనక, ఆమె ప్రపంచస్వభావమే అంత అని మాట్లాడకండా తలవొంచుకుని వూరుకుంది.

ఆచారంవల్లనూ, పెంపకంవల్లనూ, సుందరమ్మకి వితంతు వివాహం ఘోర పాపాలలో ముఖ్యమయిందని నమ్మకం. గతిలేక ఆలోచింది వ్యవధానం లేక శక్తిలేక తన కాశ్రయమిచ్చిన కుటుంబానికి అపకీర్తి తెస్తున్నాననే భయంతో వొప్పుకుంది. కాని ఆపాడు పనిచేయక ముందు ప్రాణం అర్పించి వుండేది. ఎక్కడో ఎవరో దిక్కుమాలినవాళ్ళు తలచనన్నా తలచకూడని వాళ్ళు కిరస్తాను లయిపోయి మళ్ళీ పెళ్ళిళ్ళు చేసుకుంటారని చిన్నప్పుడు విన్నది. వాళ్ళను చూడడంకూడా దోషమనుకుంది. గోబ్రాహ్మణ హత్యకన్నా వ్యభిచారంకన్న గొప్ప పాపమనుకుంది. చంద్రశేఖరంతోగానీ, యింకెవడితోగానీ జన్మమంతా రహస్య సంబంధానికి వొప్పుకునేదేమోగాని వివాహానికి మాత్రం వొప్పుకునేది కాను. వితంతు వివాహం అంత నీచమనే అభిప్రాయంతో ఆమె పెరిగింది. ఎంతో జాగ్రత్తతో, ధైర్యంతో విజ్ఞానముతో యోజించినవారి మనసులలో తప్ప సాధారణపు ప్రజల నీతి అభిప్రాయాలన్నీ హేతువాదం మీద ఆధారపడి వుండవు. చిన్నప్పటినించీ గౌరవనీయులయిన వారు ఏవిధముగా తలుస్తున్నారో దండిస్తున్నారో ఆ పద్ధతులమీద నీతిని గురించిన అభిప్రాయా లేర్పడుతాయి. అది నాటుకున్న తరవాత వాటి అన్యాయమూ హేతువైరుధ్యమూ విశదంగా యెత్తి చూపించినాకూడా గుర్తించలేరు; ఒకవేళ గుర్తించినా ప్రయత్నించికూడా వాటి ప్రాబల్యాన్ని మనసులోకి రానిచ్చి వొదిలించుకుని తమ ప్రవర్తనని దిద్దుకోలేరు. ఒకసారి ఆచారం యేర్పడ్డ తర్వాత అది వేదకాలంలో లేదనీ, శాస్త్రాలన్నీ ఖండిస్తున్నాయనీ సయిన్సు ప్రకారం హానికరమనీ, అర్థవిహీనమనీ, బోధించినా ప్రయోజనం లేదు. ఆ ఆచారం నశించాలంటే కొందరు ఆ ఆచారానికి తిరగబడి వ్యతిరేకంగా ఆచరించడమే మందు. వితంతు వివాహం శాస్త్రసమ్మతమనీ, న్యాయమనీ, వ్రాసిన వ్యాసా లన్నిటికన్నా, ఉపన్యాసా లన్నిటికన్నా, ఒక్క వివాహం జరిపించడం యెక్కువ మార్పుని తీసుకుని వొచ్చింది. ప్రజలు తాము చేసిన పనిని సమర్థించడానికి శాస్త్రాల్ని పిలుచుకుని వొస్తారు; కాని శాస్త్రాలను ముందుగా అడిగి ఆప్రకారం బతకరు.

వివాహామయి తన స్థితి ఆలోచించుకోడానికి వ్యవధి దొరకగానే సుందరమ్మకి తన రక్తంలో వున్న ఆలోచనా పద్ధతులన్నీ తిరుగబెట్టాయి. ఈ వివాహంవల్ల తాను ఘోరపాపం చేశాననుకుంది. తనను కనిపెట్టివున్న భర్తకు

మహాగ్రహం తెప్పించావనుకుంది. ఈశ్వరుడికే తనమీద క్రోధం కలిగింది. తన జన్మఅంతా ఆపదలమయం కాబోతోంది. ఈ విపత్తుల కన్నిటికీ కారణం యీ చంద్రశేఖరమని అతన్ని అమితంగా ద్వేషించింది. అదిగాక శరీరస్థితి వల్ల నైతేనేం పెళ్ళిఅయినా అతనితో శరీర సంబంధం మానుకుంటే కొన్ని పరలోక ఆగ్రహాలను తప్పించుకోవచ్చుననే ఆశతో నైతేనేం, అతన్ని తన దగ్గిరికివొస్తే తప్పించుకోవాలని చూసింది. జన్మఅంతా విడిగా వుండటానికి నిశ్చయించుకుంది. పెళ్ళి అయిందన్న మాటేగాని వాళ్ళిద్దరూ ఒక్కసారయినా ప్రేమగా మాట్లాడుకోలేదు. ఒకరొ్నకరు పరమ శత్రువులవలె భావిస్తున్నారు.

తనని నిరాకరించడానికి కారణం పరాకర్షణ అని నిశ్చయించుకుంటున్నాడతను. ఈభయమంతా ఒక వేష మనుకున్నాడు. ఇటువంటి విపరీత ద్వేషాలతో ప్రారంభమయింది వారి పవిత్ర సంసారం.

౨

సుందరమ్మ గర్భానికి ఆరోనెల వొచ్చింది. గర్భవతిగా వున్న యువతికి జరగవలసిన సరదాలు, ముచ్చట్లు, తంతులు ఏమీ జరగటం లేదు. జరగటానికి వీలూ లేదు, అనుకోడానికి పెద్దవాళ్ళూ లేరు, కర్చుపెట్టడానికి డబ్బూ లేదు. ఆమె బాధలుగాని, యెక్కువైన ఆమె ఆకలి విషయం గాని, రాబోయే కష్టాన్ని గురించిన ఆమె భయాలు గాని వినేవాళ్ళుకూడా లేరు. మొదటిది వితంతు వివాహం; రెండోది పెళ్ళయిన రెండునెలలకే ఆరు నెలల గర్భం, కొత్తమనుష్యులు, కొత్తకాపరం. అందుచేత యిరుగుపొరుగు వారెవరూ మాట్లాడరు. ఇంటి పని అంతా సుందరమ్మే చేసుకోవాలె. ఏమి సంభవించినా సరే, చంద్రశేఖరంతో మొరపెట్టుకోడంగాని, అతని కనికరాన్ని అన్వేషించడం గాని, ఆమె చెయ్యతలుచుకో లేదు. శరీరకష్టం కన్న మనోవేదన యెక్కువగా వుంది. ఏ ఆచారమూ, పండగా లేకపోవడం కిరస్తానీగా తోచింది. ఏపూజా లేదు. బ్రాహ్మలు రారు. దాసీదికూడా తక్కువజాతి యిళ్ళల్లో పనిచేస్తున్నట్టు చూస్తుంది. ఇట్లా దేవతల్ని ఉపేక్ష చెయ్యడంవల్ల గొప్ప ఘోరాలు కలుగుతాయని అమె నమ్మకం. వెంకట్రామయ్యగారి యింటో, ఆయనకాకపోయినా ఆడవాళ్లు పూజలు, పండగలు,

వ్రతాలు, అన్నీ ఆచరిస్తారు. ఇప్పుడు ఆమెకు దేవతలు కలల్లో కనపడి బెదిరిస్తున్నారు.

సంఘంనించి విడబడ్డవాళ్లు సంఘానికి యేదో వ్యతిరిక్తంగా నడుచుకుని వుంటారు. వ్యతిరిక్తప్రవర్తన న్యాయమనీ, సంఘమూర్ఖత్వమే తమని వెలిబరిచిందనీ, విశ్వాసముంటేనే గాని వొంటరితనాన్ని, సంఘ నిగ్రహాన్ని, తిరస్కారాన్ని ప్రజలు భరించలేరు. తాము సత్యాన్ని నమ్మామనీ, సంఘానికి ఆదర్శం చూపుతున్నామనీ వుండే విశ్వాసమే వారికి బలమై 'లోనీ'గా వుండడం ఇబ్బంది లేకండా కాపాడుతున్నది. తమ బాధకు అర్థమూ, ప్రయోజనము వున్నదని సమర్థించుకోగలరు. ఇతరులు తమని దూషిస్తే ప్రజల మూర్ఖత్వమని సంస్కర్తలు నవ్వుకుంటారు గాని ఆగ్రహపడరు—తాము తమ జీవితంలో అవలంబించిన సంస్కరణం, ఆత్మ సంస్కారానికే గాక, సంఘ సంస్కారానికి వినియోగ పడుతోంది గనక! కాని వితంతు పునర్వివాహం వారికి చాలా మందికి యీ చిత్త సంస్కారం లేదు. చాలామంది సంఘంలో గతిలేక భార్యకోసం వెలి పడ్డవారు. చాలామంది స్త్రీలు కామాన్ని పరిపాలించుకోలేక భర్త అనే పేరుతో పురుష మృగం దొరికితే చాలునని ప్రపంచంమీద పడ్డవారు. వారి సంస్కరణంలో వారికే విశ్వాసం లేదు—కామంలో తప్ప. అందుచేత "విధవా వివాహం వాళ్లు" అని వెక్కిరిస్తే, బాధ పడతారు, ఆగ్రహపడతారు. "అవును—ఏమి! వితంతు వివాహం చేసుకోగలిగిన ధైర్యంగలవారము. బలవంత వైధవ్యాన్నించి స్త్రీలని కాపాడానికై, సంఘ బహిష్కారాన్ని భరిస్తున్న వీరులము" అనుకోరు. అందులో యీ గోల యేమీపట్టని సుందరమ్మ, యీ వివాహంవల్ల, సుఖముగాని, శాంతినిగాని లాభంపొందని సుందరమ్మ, యీ బహిష్కారంవల్ల చాలా బాధ పడ్డది.

స్వభావంవల్ల తనతోడి వారి స్నేహాన్నీ, ప్రేమనీ అభిలషించేది ఆమె. తనుచేసిన దోషంమరిచి, యిరుగుపొరుగువారిని అతిఉత్సాహంతో పలకరించి, ఆహ్వానించి వారికోపం చూపులతోనూ, దొంగ తప్పించుకోడాల వల్లనూ గాయపడ్డది. లోకం వున్నది వున్నట్టు ఆమెకి నివాస యోగ్యంగానే వున్నది. ప్రజలు మంచివారుగానే వున్నారు. వారిలో లోపాలకంటె వారి సుహృద్భావమే గోచరిస్తుంది, ఆ సరళ హృదయురాలికి. వాళ్ళు నవ్వి

చక్కగా మాట్లాడితే చాలు, వారి జీవితము, అభిప్రాయాలూ ఎట్లాంటి వైతే తనకేం? వారినికూడా తనని అట్లానే చూడమంటుంది. వారి క్రూరత్వానికి కారణం కనపడదు. ఈ వివాహంవల్ల తాను అసలే బాధపడుతోంది. జాలి బదులు వారు క్రౌర్యం ఎందుకు చూపుతారా అనుకుంటుంది.

పురుడుకి మంత్రసాని తప్ప ఎవరూలేరు. చిన్నప్పుడు తాను చూచిన కాన్పులతో, ప్రసవించిన స్త్రీకి కలిగిన ఆదరణా; తల్లిని కాగలిగా ననే గర్వమూ, యితరులు చూపే శ్రద్ధవల్లా చనువువల్లా పూరటా; బిడ్డకి వారు చూపే గొప్పతనమూ, "ఎటెన్షన్," తలుచుకుని, తన వంటరి బతుక్కీ, బాధకీ, యేడ్చింది. ఆబిడ్డ అందం ఎవరికో చూపాలని వుంటుంది, పోలికలు అందరూ గుర్తు పట్టా లనిపిస్తుంది.

"మా అబ్బాయి మా అమ్మ ఒక పోలికేనమ్మా! తెల్లగా వుంటాడు." అంది పట్టలేక దడివెనక అంట్లు తోలుచుకునే వితంతువుతో.

"ఆహా! అవును తెలుపులో కూడా అందం లేకపోలేదు," అని తోలవకండానే కొన్ని గిన్నెలు తీసుకుని యింటోకి పోయింది.

"అప్పుడేనన్ను చూచి 'వూ' అనిందమ్మా!" అంది పొరుగింటి వంటావిడతో.

"అవును, కొందరు పిల్లలకి అట్లానే అతి తెలివి. జాగ్రత్తగా వుండాలి" అంది. పత్యం చేసుకోలేక, పిల్లకి ఉపచారం చేసుకోలేక, ఎట్లా చేసుకోవాలో తెలీక బాధపడ్డది సుందరమ్మ. తనతో 'కంప్లెయింటు' చేయకపోవడం వల్ల చంద్రశేఖరానికి ఆమె కష్టాలు తెలీవు, తెలుసుకో తలుచుకోలేదు. ఆమెకి మాతృత్వ మెంత కొత్తో, అతనికి పితృత్వమూ అంతే కొత్త. పిల్లని సృష్టి యిచ్చిందిగనుక, హృదయంలో ప్రేమనీ స్తనంలో పాలనీ ఏర్పరిచింది గనుక, యింక యేమీ అవసరంలేదనీ, మృగాలలోవలెనే, తల్లికికూడా సహజంగా పిల్లని జీవితానికి తయారు చెయ్యడం తెలుసుననీ అనుకుంటారు. తినాలంటే వంటా, తిరగాలంటే కట్టూ, మాట్లాడాలంటే భాషా, బతకాలంటే నీతీ, ముందు నేర్చుకోడం ఎంత అవసరమో, పిల్లల్ని పెంచే విధం కూడా నేర్చుకోడం అంత అవసరమేనని గుర్తించరు. భర్తని ఆకర్షించాలన్నా, స్త్రీ, మృగాలకన్న ఎక్కువ నేర్పుకలిగి వుండాలని వొప్పుకోరు.

సుందరమ్మ బారసాల చేసుకోవాలని పట్టుపట్టింది. చంద్రశేఖరం చాలా ప్రయత్నించాడు కాని ఒక్క బ్రాహ్మడూ దొరకలేదు. ఆ వితంతు వివా

హోల ఆయనకి బారసాల మంత్రాలు రావు. ఆ మంత్రాలు చదివి దేవతలని ఆహ్వానించ నందున వారికి ఆగ్రహం కలిగిందని అమె భయం. ప్రస్తుత హిందూ ప్రపంచంలో, వుత్త మంత్రపు శబ్దాలూ, నాటితో చేసే అర్థంలేని కలాపాలూ మిగిలాయి. అసలు దేవతల్నీ, వారిని చూస్తే భక్తి భయాల్నీ మరిచి పోయినారు, బారసాలలూ' పెళ్ళిళ్ళూ, చావుకర్మలూ వీటికి మత సంబంధమైన అర్థం వూడిపోయింది. సంఘ సంబంధమైన అవసరమే మిగిలింది. మర్యాదకోసం భేషజంకోసం, తక్కిన వారి అమర్యాదకు దడిశీ, ఆ తంతులు నడుపుతున్నారు. ఆ కర్మలలోని మంత్రాలవల్ల ఏ దేవతల్ని ఆహ్వానిస్తున్నారో, ఏ శక్తుల్ని ప్రజ్వలింపచేయ వుద్దేశ్యపడుతున్నారో, ఏ ధర్మాల్ని ఏ విధుల్ని పరిపాలిస్తామని ప్రమాణాలు చేస్తున్నారో ఎవరికీపట్టవు. అర్థంకావు. ఆ దేవతల ప్రమేయమే అక్కర్లేదు. కాని పాపం, సుందరమ్మ హృదయంలో మాత్రం వారి అసలు 'స్పిరిట్' వుండిపోయింది. ఆ దేవతలు తృప్తిపడి, ఆశీర్వదించాలి. పంచభూతాలూ తన శిశువును పోషించి కాపాడ తామని అభయ మివ్వాలి. అట్లా చెయ్యకపోతే జీవితం అపాయంలో పడుతుంది. తన బిడ్డ ఏ దేవతల సహాయమూ లేక అనాధ ఐ పోయింది. మంత్రాలతో పూజలతో సంప్రీతుల్ని చేసి, ఆహ్వానించందీ, ఆ దేవత లెందుకు ఆశీర్వదిస్తారు ? ఇంక ఆ బిడ్డకి తానే దిక్కు. తల్లి పనీ, దేవతల సహాయమూ అన్నీ తానే చెయ్యాలి. తాను ఏమాత్రం ఏమరినా, మహాదుపద్రవం తటస్థిస్తుంది. ఇట్లా నమ్మి, ఆలోచించి ప్రతి నిమషమూ బిడ్డని కనిపెట్టుకుని కూచుంది. వంట తగలేస్తోంది. తక్కిన పనులికి భర్తపిలిస్తే పలకదు. మరీ గోలపెడితే "మీరే చేసుకోండి" అంటుంది. దేనికి కదలవలసి వచ్చినా, ఆ బిడ్డతోనే బయలుదేరుతుంది. ఎవరన్నా ఆమె ఆదుర్దాని చూస్తే కోపమూ, నవ్వూ వొస్తాయి. కిటికీలూ తలుపులూ తెరవదు. గాలి రానీదు. ఆ బిడ్డ ఏడ్చినా భయమే, ఏడవక వూరుకున్నా భయమే. ఆవలిస్తే ఏదో భయం, ఎక్కిళ్ళువొస్తే పెద్దజబ్బని నిశ్చయం. కళ్ళు ఎటుతిప్పినా సందేహమే. సహజంగా, కోమలంగా, విజృంభించి ఆవరించే సంతోషాస్పదమైన మాతృభావం యిట్లా వంకరట్లుతిరిగి, ఆమెకి వెర్రులెత్తించింది. ఆ లేత తల్లికి దిక్కులేక, విద్యలేక, ధైర్యంలేక, వుత్త గుడ్డిప్రేమతో, భయాలు కల్పించుకుని బాధపడుతోంది. ఎండాకాలం నోరు ఆరుతుందని, అర

గంటకి అరగంటకీ పాలిచ్చి అజీర్ణం తెప్పించింది. పొట్ట వుబ్బి కడుపులో నెప్పితో పిల్ల ఏడుస్తోవుంటే, సమదాయించడానికి, మళ్ళీ పాలిచ్చింది. ఆపిల్ల కుడుచుకునే "ఇక్ట్ సింకు"తో తాగి, యింకా బాధపడ్డది. కక్కులు కలిగి, జ్వరం తగిలేప్పటికి దేవతల ఆగ్రహం ప్రారంభించిందని ఏడుపు ప్రారంభించింది. సుందరమ్మ తానుతప్ప ఆపిల్లకి గతిలేదనీ, ముసలమ్మ ముద్దూ, బంధువుల ముద్దూ, తానే చెల్లించాలనీ, ఎప్పుడూ ఎత్తుకునే వుంటుంది. తన పాత మురుగులు అమ్మి, ఆపిల్లకి బలువైన మురుగులూ, గొలుసులూ, కడియాలూ, చేయించి పెట్టింది. ఒక రక్షరేకు కట్టింది. జ్వరానికీ, అజీర్ణానికీ మందులు ప్రారంభించింది. ఈ దేశంలో సలహా ఉచితము. అంత చవకగా దొరికేది ఇంకేంలేదు. ఒకళ్ళూ బాధ్యత తీసుకోరు, యింటి గుమ్మం తొక్కరు. కాని గోడమీదినుంచి సలహాలు విసురుతారు, అమితంగా.

"ఏమమ్మా! మీపిల్లకి జ్వరమా? పాపం! ఏంచేస్తాం ఖర్మం! వాము తెచ్చి రసంతీసి పొంగించి పొయ్యి."

"వాము తెచ్చేవాళ్ళెవరూ లేరే!"

"లేరూ?" అంటో యింటోకి పోతుంది.

"మాచంటివాడికి యింతేనమ్మా! దుంపరాష్ట్రం కాల్చి బూడిదచేసి, ఆనీళ్లు పోస్తే జ్వరం పోయింది అట్లాచెయ్యి."

"నాకు చాతకాదు. కొంచెంచేసి పెడుదురూ."

"నాకెక్కడ తీరుబడి!" అంటో వెళ్లింది యింటో ఆమె.

ఈ వితంతు వివాహం చేసుకున్న వాళ్లకి చిక్కులు రావడం తక్కిన వాళ్లకేమీ విచారంగాలేదు. అట్లాంటి పాడుపని చేస్తే ఏమవుతుంది మరి! దేవుడులేడూ?

పాపం తనే బజారుపోయి ఆవిషాలు కొని తెచ్చింది. రోడ్డువెంట నడిస్తే, పక్కన రౌడీలు, ఆమె యెప్పుడు లభిస్తుందా అన్నట్టు, ఈ పోలీసులనే వాళ్లు వున్నారుగాని, లేకపోతే అమాంతంమీదపడి యెత్తుకుపోమా అన్నట్టు చూస్తారు. మర్యాదస్తులూ, వుద్యోగస్తులూ, కళ్లవోరగా వాళ్ళి పక్కకి చూసినట్టు చూసి తృప్తిపడతారు. ఆచూపుల్ని వోర్చుకోలేక అసహ్యపడి, ప్రపంచాన్నీ తననీ తిట్టుకుని, బిడ్డ యామైందో అనే ఆత్రుతతో యింటో వొచ్చి పడుతుంది.

ఆమందుల్ని నూరి పొంగించి, పొరుగువాళ్ళని ప్రశ్నించి విసిగింది, ఆ కారంరసాల్ని ఆ పసిపిల్లనోట్లో పోస్తే, ఆపిల్ల ఆబాధ అర్ధంగాక, తన్నుకొని, ఆమెవంక జాలిగా చూస్తే గుండె తరుక్కుపోయి యేడుస్తుంది, ఆ పిచ్చితల్లి.

చివరికి ఒకరోజు మధ్యాహ్నం ఆబిడ్డకి జబ్బు ఎక్కువై గడబిడ చేసింది. ఎవరూ యింట్లో లేరు. సుందరమ్మకి యేమీ తోచక, తల్లిదగ్గర్నించి నేర్చు కున్న ఆపదోద్ధారక స్తవం ప్రారంభించింది. బిడ్డని వొదిలేసింది. ఆమె అవ సరంవున్న స్థితిలో లేదుబిడ్డ. అతి దీక్షతో, విశ్వాసంతో పఠించి, తన యిష్ట దైవమైన పార్వతికి, సహస్రనామార్చనా, కొత్తచీర కావాల్ని మొక్కుకుంది. చంద్రశేఖరం వొచ్చేప్పటికి కిటికీ దగ్గర కళ్ళుమూసుకు కూచునివుంది. పిలిస్తే పలకలేదు, అతను బిడ్డవంక చూసి డాక్టరుకోసం పరి గెత్తాడు. కాని డాక్టరు వొచ్చేప్పటికే పిల్ల ఏడ్చి పాలుతాగుతోంది, సుఖంగా. ఆయన అపాయం దాటిపోయిందనిచెప్పి మందు ఏదో పంపాడు. కాని సుందరమ్మ ఆ మందుని వాడనే లేదు.

బిడ్డకి కొంచెం కులాసా యివ్వగానే తన మొక్కు చెల్లించే ప్రయత్నం ప్రారంభించింది. చీరకోసం పదిహేను రూపాయ లడిగేప్పటికి చంద్రశేఖరం గుండె పగిలిపోయింది. ఆతనికి అర్థం కాలేదు.

"ఇప్పుడెందుకు అమ్మవారికీ చీర?" "సంబంధమేమిటి, దానికీ దీనికీ?"

"ఆమే నయం చేసింది."

బిగ్గరిగా నవ్వాడు. ఇంక తనప్రార్థనా, మొక్కూ సంగతి ఆమె చెప్ప తలుచుకోలేదు.

"పోనీ, నాకు కావాలి యియ్యండి."

నీకు కావాలీ? పదిహేను రూపాయలా! రూపాయలు కోళ్లు ఏరుకు తింటున్నాయా? నోరుమూయ్యి."

తనూ తనబిడ్డా! ఇద్దరూ దరిద్రులు. ఎప్పుడైనా ధనం వొస్తుందా? జీవితమంతా యింతే. బిచ్చగాళ్లు ఈలోకంలోకి అష్టదరిద్రులై వొచ్చారు. ఇంత దరిద్రంలో, ఏమీ సహాయం చెయ్యలేని తనకి ఎందుకి పుట్టాలి ఆబిడ్డ! కూలిది, పాకీది, కష్టపడి, సంపాయించి కూడబెట్టే ఆశవుంది వారికి! తనకి యాచకత్వం తప్ప గతిలేదు. తన అవసరమైతే అభిమానంతో వూరుకుని వుండును. కాని తనబిడ్డ, మళ్లీ రోగం వొస్తే!

అదీగాక దేవతలు వుత్త అభిప్రాయాలు కారు ఆమెకి; వాస్తవమైన వ్యక్తులు. ఈ మనుష్యు లందరికన్నా ఆమెకి సన్నిహితులు. అంబను నమ్మించింది, ఆమెతో అబద్ధమాడింది. ఆమె ఆగ్రహిస్తుంది. అంతేకాదు "సుందరమ్మ ఏమోననుకున్నాను దానిమాట నమ్మి వుపకారంచేశాను. ఇంతమోసకత్తా!" అనుకుంటుంది ఆదేవి. ఆదేవతలు, తమ చీరెలకోసం, భోజనంకోసం భక్తుల మీద ఆధారపడి వుంటారనీ, భక్తులు నిర్లక్ష్యం చేస్తే బాధపడతారనీ అను కుంటుంది. ఏంచెయ్యాలి? మళ్లీమళ్లీ చంద్రశేఖరాన్ని బతిమాలింది. పాపం, ఒకరోజురాత్రి అతనిమీద, లేని మోహాన్నిచూపింది. అతన్ని లాలించి ఆనందపరిచింది. అతను చాలా సుఖంలో వుండగా, తన సిగ్గునంతా తొక్కి పట్టి చిరునవ్వుతో, "నాకా పదిహేనురూపాయలూ యివ్వరా! అంది." వొణుకుతోంది.ఏం ప్రత్యుత్తరం వొస్తుందో !

"పిచ్చిపిల్లా! కష్టపడి... నేను పనిచేసి దాచుకున్న......డబ్బు కాస్తా యిట్లా కర్చుచేస్తే........ఎవరికోసం!.......నీకోసమేగా......మన అబ్బాయికోసం......మళ్ళీ పిల్లలు పుడితే!......వూరుకో......మూడు రూపాయలు........."

సుందరమ్మ కుంగిపోయింది. వొళ్ళంతా అసహ్యాపడ్డది. వేశ్యాత్వం చేసినట్టయింది. చాలామంది పతివ్రతల స్థితి యింతే. భర్తలతో వ్యభిచారం చేసేనేగాని గతి లేదు. అప్పటికీ వేశ్యకి ముట్టేటంత ప్రతిఫలంకూడా దొరకదు. చంద్రశేఖరంమీద భరించలేని అసహ్యం ద్వేషం కలిగాయి ఆమెకి. ఆసమయంలో అతన్ని చంపడానికి ఏమాత్రమూ సందేహించి వుండదు. కాని మర్నాటినించీ మళ్ళీ అతన్ని సేవించి, కామించి, పిల్లల్ని కనితీరాలి. ఇదీ కుటుంబ చరిత్ర !

విధిలేక వెంకట్రామయ్యగారి నడిగి పదిరూపాయలు సంపాయించింది. తన చీరెలు తాకట్టుపెట్టి ఐదూ భర్తీచేసింది. ఇవన్నీ పట్టుకుని సాయంత్రం పక్కనవున్న యీశ్వరుడి గుడికి పోయింది. అక్కడ ఒకమూల పురాణం చెపుతున్నారు. పూజారికూడా అక్కడే కూచున్నాడు. పురాణంలో కూచున్న కామమ్మకోసం విటుడు, దుర్గయ్య మంటపంలో కూచున్నాడు. కామమ్మకీ పూజారికీ సంబంధమున్నదని అతని అనుమానం. రెండోపక్కన గన్నేరు పొదవెనక డబ్బులుపెట్టి ఆరుగురు పేక ఆడుతున్నారు. వొద్దంటా

గనే భయంతో యిద్దరు తొడకింద బీడీలు దాచుకుని తాగుతో వుమ్మేస్తున్నారు. ఆ ప్రదోష సమయంలో మహేశ్వరుడికి, తన వెయ్యి పేర్ల బదులు బూతులు వినపడుతున్నాయి.

ఎవరో టెంకాయ తీసుకొచ్చాడని పూజారి బద్ధకంగా లేచాడు. ఇంకెవరైనా స్త్రీ ఐతే ఎవరూ గమనించకపోదురు. సుందరమ్మ లావణ్యం ఆ గుడి ఆవరణవంతా మతాబువలె వెలిగించింది. ఆ సాయంత్రపు ఎండలో, బంగారంమీద పొదిగిన రవ్వవలె మెరుస్తోంది ఆమె శరీరం. ఆరునెలల కిందటే పిల్లని కని గుడివెనక పారేసిన శేషమ్మ కళ్లు వురిమి ఆమెవంక చూసింది. వితంతు వివాహం చేసుకొన్న సుందరమ్మకి గుడిలో యేం పని? పవిత్రమైన ఆలయం గడప తొక్కడానికి ఆమెకేం అధికారముంది? పూజారి ఆమెపళ్లాన్ని అందిపుచ్చుకుని, చీరను చూసి ముగ్ధుడౌతున్నాడు. శేషమ్మ తొరగావచ్చి—"అయ్యా, సుబ్బయ్యగారూ ఒకమాట."

పూజారి తిరిగి వొచ్చాడు.

"అమ్మా. మీరు పునర్వివాహం చేసుకున్నారుట కదా! ఇది మర్యాద కాదండి." అని పళ్లెం అక్కడే పెట్టాడు. ఆయన కోపమంతా శేషమ్మమీదే. అన్యాయంగా చీరె దక్కకుండా అడ్డపడ్డది. ఆ శేషమ్మ సంగతి తెలీని దెవరికి?

"కాని, నేనిక్కడే నుంచుంటాను. మీరు ఇవి అంగీకరించండి. అమ్మ వారికి సమర్పించి పూజ చెయ్యండి."

అవును. దానికేం అభ్యంతరం వుంటుంది? తటపటాయించాడు. ఇంతలో శేషమ్మ పురాణందగ్గిరికి పోయి తన ఘనకార్యం వర్ణిస్తోంది. ఈ సేవవల్ల తన గౌరవం కొంత వృద్ధి పొందవచ్చు. తన మీదవున్న కొన్ని నిందలు మాసిపోవొచ్చు. ఏమో యీశ్వరుడికి కూడా దయగలిగి, తన ప్రస్తుతపు రెండో అనుమానాన్ని నివర్తించవొచ్చు.

"పెళ్ళి చేసుకుందిగాక, తనూ ముత్తైదనేనని, కులుకుతో పళ్లెంపట్టుకు దయచేసింది చూడండి. వీళ్ళకి సిగ్గూ భయముకూడా వొదిలిపోయినాయి. ఇంక మన పంక్తికి భోజనాలకి తయారౌతారు," అంటోంది.

అందరికళ్లూ పూజారిమీద వున్నాయి. పురాణంశాస్త్రిలు అసాధ్యుడు.

"వీల్లేదమ్మా. వీల్లేదు. తొరగా వెళ్లిపొండి ఇక్కణ్ణించి" అన్నాడు పూజారి దడిశి.

"ఇవి ఇక్కడే వొదిలి వెడదాను పోనీ."

కొందరు పురాణంవాళ్ళు లేచి దగ్గిరికి వొస్తున్నారు - అందులో రాజమ్మ కూడావుంది. ఆమె నోరు విప్పిందా యింక ఆ రెండు ప్రవాహాలకీ అడ్డు వుండదు. "వీల్లేదు. తీసికెళ్ళండి" అన్నాడు పూజారి.

అభిమానధనయైన సుందరమ్మ, ఆగుంపు చూపులు భరించలేక, పళ్లెం తీసుకుని చివాలున వెనక్కిపోయింది. ఆమె అందాన్ని చూసి గుటకలేస్తో మొగవాళ్లు నుంచున్నారు. తమ మతవిజయాన్ని సూచిస్తో స్త్రీలు దరహసితవదనారవిందలై చూస్తున్నారు. పావురాలు నెమ్మదిగా మూల్గుతున్నాయి. పచ్చగన్నేరుపూవులు గాలిలో కిందికిరాలాయి. భక్తపరాధీనయైన పార్వతి ఒక్కమాటలేక పెద్దగుడ్లు పెట్టుకొని చూస్తో కూచుంది. బిక్కమొహంతో, దేవతలుకూడా నిరాకరించిన తన నికృష్టపు కానుకతో తిరిగివొచ్చి ఆ పిచ్చితల్లి నిద్రపోయే తనబిడ్డవంక చూస్తో,

"నీవైనా నాకు దక్కుతావా? నన్ను వొదిలి వెళ్లిపోతావా? ఇంక నాకు బిడ్డలు పుడతారా? ఇంతేనా? ఎవరూ దిక్కులేక, ప్రేమించడానికి ఆధారమేలేక, ఎన్నియేళ్లు యీ వొంటరి ప్రపంచంలో బతకను? చివరకి, నువ్వుకూడా, నాప్రాణానివి, నావంక అంతప్రేమగా చూసి, నాముఖం చిన్నిచేతులతో తాకే నువ్వుకూడా వెళ్లిపోతావా?" అన్నట్లు చూస్తో నుంచుంది. రెండు కన్నీటి చుక్కలు ఆమె పమిటమీద పడ్డాయి. పడమటి కడపటికాంతి ఆమె నల్లగా నిగనిగలాడే జుట్టులో మెరిసింది.

అగ్గిపెట్టికోసం వెతికింది. కనపళ్లేదు. సూర్యుడే వొదిలిన జీవితాలకి, అగ్గిపెట్టిమాత్రం దొరుకుతుందా!

వూళ్లో ఆ చివరవున్న గుడికి మర్నాడు వెళ్లాలని నిశ్చయం చేసుకుంది. అక్కడ తనని యెరిగి వుండరు కద! మర్నాడు తలంటి పోసుకుంది. పూలూ అన్నీ తెప్పించింది. బండిపిలిచింది. పళ్లెంవంక చూసేప్పటికి చీరలేదు. గొప్ప సంతోషం వొచ్చింది. పార్వతీదేవి తన అవస్థని కనిపెట్టి, తానే చీరని స్వీకరించింది. ఇంకేం అదృష్టం కావాలి తనకి అంతకన్న! అదేమీ ఒక వింతకాదు ఆమెకి. ఇట్లా దేవతలు తమకు కావలసినవి స్వీకరించడం పుట్టింటో తన చిన్నతనంలో చాలాసార్లు మామూలుగా జరిగేవి. ఎంతో ఆనందం కలిగింది. బండివాడికి అణాయిచ్చి పంపేసి, తన బిడ్డ నెత్తుకుని ధైర్యంతో ముద్దాడింది.

రాత్రి చంద్రశేఖరంతో చెప్పకుండా వుండలేకపోయింది.

"ఆపళ్లెంలో ఒక చీరపెట్టాను."

"పళ్లెంలోనా! చీర పెట్టావా? పెడితే!"

"పెడితే, యీవాళ కనపళ్ళేరు. ఏమైందో కనుక్కోండి."

ఆమె మాటల్లోని సంతోషాన్ని గ్రహించలేదు అతను.

"అసలా కొత్తచీర నీకెక్కడిది?"

ఇతనికి ఆ కొత్తచీర సంగతి యెట్లాతెలుసు? చప్పున తగ్గింది. అనుమానం కలిగింది.

"కొత్తచీర అని మీకెట్లా తెలుసు?"

ఒకవేళ రాత్రి ఆమూలకి వెళ్ళిచూశాడేమో!

"నాకేం తెలుసు? ఎట్లా తెలుసా? పళ్లెంలో పెట్టానన్నావుగా! కొత్తచీరేమో అనుకున్నాను. నీకెక్కడిది?"

"నాకా! ఎక్కడిదో! కాని ఆచీర యేమైంది?"

"ఏమో! నాకేం తెలుసు నన్నడుగుతావేం? ముందు అది ఎక్కడిదో చెప్పు."

ఆమె మాట్లాడలేదు. కోపం, రోషం, అసహ్యం, భయం, ఇన్నీ వొక్కసారి కలిగాయి. ఆరాత్రంతా కిటికీదగ్గిర కూచుని, గుడికేసి చూస్తో, పార్వతీదేవితో తనగతి విన్నవించుకుంది. భర్తని తిడితే మళ్ళీ దేవతలకి కోపం వొస్తుందని భయం.

"తల్లీ! నీకు తెలుసు నాభర్త యెటువంటివాడో, అందువల్లనే నేను నాగ్రతం నిలుపుకో లేకపోయినాను. నన్ను కరుణించాలి" అంది.

అయినా మనసు ఆగలేదు. ఇంకో చీర తాకట్టుపెట్టి, ఒకపట్టురవికబట్ట కొంది.

దేవతలపూజ లంటే, తమ సౌఖ్యాన్ని, ప్రాణాల్ని కుటుంబాల్ని, సూర్యచంద్రుల్నే త్యాగం చెయ్యడానికి సంసిద్ధులైన మహాఋషి పత్నుల రక్తం ఆమె నాళాలలో చిందులు తొక్కింది. ఎన్నడూలేని సాహసం అప్రయత్నంగా కనిపించింది.

రాత్రి యెనిమిదైంది. కటికచీకటి. రోడ్డుమీద మనుషులు తిరగడం తగ్గారు. తన మహద్యత్నానికి గడిచిన గంటనించి ధైర్యం తెచ్చుకుంటోంది,

మళ్ళీ చంద్రశేఖరం వొస్తే విఘాతం కలుగుతుంది. ఆ దేవిమీదనే భారం వేసి నిద్రపోతున్న బిడ్డకేసి ఒకసారి చూసి, కళ్లుమూసుకుని తెరిచి, వీధి తలుపు దగ్గర వేసి చప్పున వీధిలోకి వెళ్ళింది. తలవొంచుకుని ఇటూ అటూ చూడక నడిచింది. చంద్రశేఖరం ఎదురౌతాడని వొకటే ముఖ్యమైనభయం. సరాసరి రోడ్డుమీదనించి ప్రాకారంలోకి వెళ్ళి ఆగింది. చుట్టూ చూసింది. ఎవరూ కదలటంలేదు. గుళ్లో రెండుమూడు దీపాలు దిక్కులేత వెలుగుతున్నాయి.

బైటనించి 'ఆకలేస్తోంది; అయ్యలారా' అని కాఫీహోటలు గుమ్మంలో కూచున్నవాడి ఆర్తనాదం వినపడుతోంది. ఒక్క నిమిషం సందేహించి చటాలున లోపలికి వెళ్ళింది. పార్వతీ విగ్రహం ముందు ఒక చిన్న దీపం వెలుగుతోంది. అనంతకాలాన్ని హక్కుగాగొన్న ఆలయపు చీకట్లు ఆచిన్ని వెలుతుర్ని మింగుతున్నాయి. తన పని సమ్మతమేనా అనే ఆలోచన కూడా లేక, కార్యసాధనే ప్రాముఖ్యమనే ఏకాగ్రతవల్ల, పమిట కొంగుతో ఆ దీపాల్ని ఆర్పింది. పట్టుబట్టను తీసి అమ్మవారి మెడను చీకట్లో స్పృశించి, కప్పి, బిగ్గరిగానే, చిన్నస్వరంతో, "తల్లీ ఇంతకన్న నాకు శక్తిలేదు. సర్వమూ తెలిసిన దానివి. దీనినే గొప్ప చీరెగా గ్రహించి, నా కొడుకును కాపాడు" అని వొంగి ఆమె పాదాల్ని గట్టిగా పట్టుకుంది. తన నిస్సహాయత్వం, తాను పొందిన నీచత్వం, తన బిడ్డ అపాయాలు అన్నిటికీ కలిపి పెద్ద ఏడుపు వొచ్చింది. ఆపుకోలేకపోయింది. గొల్లుమని ఏడ్చింది. ఆమె కన్నీళ్లతో దేవి పాదాలు అభిషేకాన్ని పొందాయి.

"ఎవరది?"

చప్పునలేచి నీడవలె గర్భగుడి చీకట్లలో మాయమైంది. ఎవరో వస్తున్నారు, బైటికివచ్చి చీకట్లో నుంచుంది. ఎవరూ లేరు. బిరబిరా నడిచింది బైటికి. ఎవరో వెనక వడివడిగా నడుస్తున్నారు. "ఎవరూ?" అంటో సమీపిస్తున్నాడు. గాలిగోపురంకింది చీకట్లలో కలుసుకున్నాడు. నాలుగు గజాల దూరంలో రోడ్డు కాచి నడుం పట్టుకున్నాడు.

"ఎవరది రా."

లోపలికి లాగుతున్నాడు.

"తల్లీ, పార్వతీ రక్షించు.

ఎట్లా కేకలు వేస్తుంది? గుళ్ళో ప్రవేశించినందుకు శిక్షిస్తారుగావున్నే! లోపలికి లాగుతున్నాడు, ఆ రెండో చెయ్యి.

హరి హరీ, యెట్లా?

"ఓరీ చస్తావురా! నేను పార్వతిని."

ఆ శబ్దం గర్భగుళ్ళోంచి విని, ఆ శిలావిగ్రహ నేత్రం ఆర్ద్రమైంది. నక్షత్ర కాంతితో ఆమె వున్నత శరీరం, దీర్ఘ బాహువులు—బంగారుఛాయ, గంభీర కంఠం; వొణికిపోయినాడు. వొదిలాడు. ఆమె అదృశ్యమయింది.

అవును. ఆమె గర్భగుళ్ళోంచే బైలుదేరింది. పార్వతేనేమో! రాత్రి పూజారి సుబ్బయ్యకి పెద్ద జ్వరంవొచ్చి "తల్లీ, తల్లీ, పాపిని క్షమించు" అని సంధిలో అరవడం ప్రారంభించాడు.

## ౮

మూడు నెలలు గడిచాయి. బిడ్డ రోజు రోజూ క్షీణించు కొస్తోంది. కష్టాలూ దగ్గూ. వాటితోకూడా తల్లి ప్రేమా వృద్ధిఅవుతోంది. ఆమె ప్రేమవల్ల, అధికమైన శ్రద్ధవల్ల బిడ్డకి బాధలూ యెక్కువవుతున్నాయి.

సుందరమ్మకి యీ మాతృత్వం 'ఇన్‌స్టింక్ట్' ఒక పిచ్చికింద తయారైంది. బిడ్డకీ, భర్తకీ, తనకీ, సంసారానికీ, గొప్ప ఆనందం యివ్వవలసిన శక్తులన్నీ వక్రించి, విషమించి యెదురుతిరిగి ఆమె హృదయాన్ని తినేస్తున్నాయి. రాత్రులు చంద్రశేఖరాన్ని దగ్గిరికి చేరనీదు. "చేసిన పాపం చాలు, ఇంకో జన్మానికి అక్కర్లేదు" అని తీవ్రంగా నిరాకరిస్తుంది. ఆతనికీ స్త్రీ ఆవశ్యకతే గాని, సుందరమ్మమీద ప్రత్యేకమైన ప్రేమాలేదు, ఆకర్షణాలేదు. కామం పెట్టే కలత వల్లా, తన హక్కులు పోయినా యనే చింతవల్లా, అభివృద్ధి అవుతున్న ఆగ్రహంతప్ప.

ఆమధ్యనే ఆవూరు ఒక దివ్యజ్ఞాన సమాజకుడు వొచ్చి, పరలోకాలలో ఆత్మల జీవితాల్ని గురించి స్త్రీలకు ప్రత్యేకం ఉపన్యాసాలిస్తున్నాడని విని సుందరమ్మ ఆశతో మీటింగుకి వెళ్ళింది. చచ్చినవాళ్లు యెక్కడికీ పోరనీ, తాము యెవర్ని ప్రేమిస్తున్నారో వారినే అంటిపెట్టుకుని తిరుగుతారనీ, మంచీ హానీకూడా చెయ్యగలిగినశక్తి ఆ ఆత్మలకి వుంటుందనీ, తాను, తన సహచరులూ, దేహాల్ని యిక్కడ విడిచివెళ్ళి వాళ్లతో కాలం గడుపుతో

వుంటామనీ చెప్పాడు ఆయన. సుందరమ్మకి ఆరాత్రి జ్వరం వొచ్చింది. ఆనాటినించి మొదటి భర్త ఆమెతో నివాసం ప్రారంభించాడు. అసలు చంద్రశేఖరం తన భర్త కానేకాడనే వుద్దేశ్యంలో పడ్డది. ఒకనాటి రాత్రి అతను బలవంతంచేస్తే వొణికి, అరిచి, జుట్టుపీకి, గోడ్డుమీదికి దూకడానికి సిద్ధమయింది. అతిసాధువు, సుశీల, శాంతమూర్తి, ఐన సుందరమ్మ కాల భయంతో తన వంక చూస్తో కిటికీమీద చెయ్యేసి వెనక్కి చూసే లావణ్య రాశిని, చూసి, భ్రమిసి, అతని బాంకు (Bank) హృదయం సహితం భగ్గుమంది, చివరసారి.

చంద్రశేఖరానికి వేళకి వంటకూడా తయారు కాదు. పూజలు, జపాలు, స్నానాలు, వ్రతాలు అతని ప్రాణం తీసేస్తున్నాయి. ఆ ఆచారాలూ బిడ్డా తప్ప వేరే ప్రపంచంలేదు సుందరమ్మకి. ఈ మతాచారాల నన్నిటినీ, ముఖ్యంగా స్త్రీలలో, అర్థహీనమనీ, మూర్ఖమనీ సులభంగా అనేసి, యివి యెన్నాళ్ళకీ వొదలవేమో అని దుఃఖిస్తారు, ఆఫీసర్లూ, దేశభక్తులూ. కాని యీ కర్మకలాపాలే, కడగడాలే, పసుపులు పుయ్యడాలే, లోకంలో యింక వేరే విలవలేని అనేక జీవితాలకి, ప్రాముఖ్యతవుందనే illusion ఇల్యూషన్ కల్పించి self importanceని కలగచేసి యేగతీ, ఆనందమూ, ఆధారమూ, తృప్తీలేని, బతుకుల్ని యేదో వొక విధంగా సద్భరంగా చేస్తున్నాయో తెలుసుకోరు. ఇతరమైన ఆసక్తులన్నీ, 'ఇంటరెస్ట్సు'ని కలిగించకండా, తమ అనుకూలంకోసం. ఆఫీసులకోసం దేశ అభివృద్ధికోసం, తమ స్వంత అభిమానంకోసం, స్త్రీలని పాతమార్గాల్ని మానుకుని తమకి అనుకూలం కలిగించమంటారు. వేరేధ్యాసల్ని స్త్రీకి కలిగిస్తే, పాతివ్రత్యపు డబ్బాల్ని తెరిచి విచ్చలవిడిచేస్తారేమోనని భయం. పూర్వపు మూర్ఖత్వాన్ని వొదలాలి స్త్రీ, నవీన విజ్ఞానాన్ని పొందకూడదు. ఇదీ యీనాటి పురుషుడి ఆశయం.

తక్కిన ఆనందాలు తగ్గినకొద్దీ, చంద్రశేఖరానికి యిష్టంలేదని తెలిసినకొద్దీ, తన వివాహం తనమర్యాదకు, కులాధిక్యతకు కళంకం తెచ్చిందని తోచినకొద్దీ సుందరమ్మ తన ఆచార చాదస్తాన్ని ఎక్కువచేసుకుంటోంది, సహజంగా.

విద్యా, సెక్సు, ధనం, యివన్నీ కల్పించే అంతరాలకన్న, ఎక్కువైనది, వున్నతమయింది, ఆత్మ ఆధిక్యతను, జన్మ యిచ్చేట్టుంది స్త్రీ పురుషులకి. చంద్రశేఖరం భర్తగనక అధికారి. తన అధికారం నిలుపుకోడానికి

ప్రయత్నిస్తాడు. కాని జన్మవల్ల సుందరమ్మ అధికురాలు. ఆమె ఆత్మబౌన్న త్యంవల్ల, దానిముందు జంకుతున్నాడని తాను చంద్రశేఖరానికి తెలీదు. తన పిరికి తనానికి నిందించుకుంటాడు.

చంద్రశేఖరం, ఆమెని అదమాయించే ధైర్యమూ, వోపికాలేక, యింటో శాంతీ, సుఖమూలేక, యింటికి రావడమే మానేసి, ఎక్కడెక్కడో రాత్రు లంతా డబ్బుపెట్టి చీట్లపేక ఆడడంలో, తనకి బరువైన సంసారమున్నదనీ, యిల్లు నరకంగా వుందనీ, తనకి ఒక ఆత్మ వున్నదనీ మరిచి పోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

మూడురోజులనించి పిల్లకి మగతగావుంది. సగంకాలం బాధతో గిలగిల లాడడం, సగంకాలం కదలకండా పడి వుండడం. ఏది నిజమో నిర్ణయిం చుకో లేకండావుంది సుందరమ్మ. ఆపిల్లపడే బాధఅంతా, గుక్కుతిప్పడం, చేతులు గుంజుకోడం, మెలికలు తిరగడం, ఇదంతా తనుచేసిన పాపాల ఫలి తంగా జరుగుతున్నాయనే గొప్ప దిగులుతో వేదన అనుభవిస్తోంది. ఎట్లా పరిహారం చెయ్యాలి? ఏ త్యాగంవల్ల, యేబాధవల్ల, ఏ అసహ్యాపు అనుభవం వల్ల, తాను కాలిపోతే, ఆపిల్లకి పరిశాంతిని కలిగించ గలదు?

పిల్లకి మందువేయిద్దామంటే, ఆస్పత్రిడాక్టర్ని పిలిపిద్దామంటే చంద్రి శేఖరం డబ్బివ్వడు. అసలు ఆపిల్ల వంకనే చూడడు. పదే పదే యాచిం చడం ఆమెకి అభిమానం; బిడ్డకి కావలసిన సహాయానికై మొగవాణ్ణి యాచించేగతి ఒక యీనాగరికపు తల్లులకే పట్టింది. వెంకట్రామయ్యగారు కుటుంబంతోసహా కాశీయాత్రికి వెళ్ళారు, వాళ్ళ నడుగుదామన్నా.

ఆరాత్రి పిల్లని పక్కలోవేసుకు పడుకుంది. నోట్లోంచి రొమ్ముతీసే యేడుస్తుంది. అదిగాక అది వొక్కటే సుందరమ్మకి మిగిలిన ఆనందం. పాలు కుడుచుకోడమనేపని, తల్లి రొమ్ముకి ఆనుకుని శాంతంగా కడుపునించుకోడం, వుత్త ఆకలితీరడంకన్న గొప్ప తృప్తినీ ఆనందాన్నీ యిస్తుంది పిల్లకి. అంత కన్నా గొప్పశాంతీ, సుఖమూ కలుగుతాయి తల్లికి. ఆ ఆనందంలో కళ్ళు మూతలుపడుతున్నాయి సుందరమ్మకి. దూరంగా గోడపక్కన పడుకుని చంద్రిశేఖరం నిద్రపోతున్నాడు. ఎందుకో యీవాళ తొందరగావొచ్చి దిగులుగా పడుకున్నాడు. ఆమెకి కొంచెంగా జాలికూడా కలిగింది అతని మీద. కనుక్కుంటే! పాపం తాను అతనికి జీవితం దుర్భరంగా చేస్తుం

దేమో, కాని......వొద్దు......అతను చీట్లపేకలో మూడున్నర వోడడం వల్ల ఆ దిగులు పడుతున్నాడని ఆమెకేం తెలుసూ ?

ఎంతసేపు నిద్రపోయిందో? కలవొచ్చింది. పిల్లలు, పిల్లలు, ఎంతమందో పసిపిల్లలు. పాలుతాగే పిల్లలు. ఒకటే, కుడుచుకుంటున్నారు. వేళ్ళు, చెవులు, బుజాలు, వీపు, అంతా ఒకటే విద్యుల్లతలవంటి ఆనంద ఝురులు ఝల్లుమంటున్నాయి. సౌఖ్యం భరించలేక కళ్లు తెరిచింది. చంద్రశేఖరం ఆమెమీద అనుకుని అనుభవిస్తున్నాడు ఆ ఆనందమంతా. ఆశ్చర్యపడి, ఆగ్రహపడి లేవబోయింది. చాలదినాలనించి పురుషస్పర్శని మరచిన ఆమె నరాలు గొల్లుమని యేడ్చాయి. శరీరం తిరగబడి అదమాయించింది. కాని అప్పటికీ ఆమె ఆత్మ ఒప్పుకోక శాసించింది, నెట్టింది, తోసింది, తిరిగింది. వాడు, ఆ దుర్మార్గుడు పిల్లమీదికి దొర్లి కిరుక్కురు మనిపించాడు. కాని వొదల్లేదు. విధిలేక కళ్ళు మూసుకుంది. ఆనిమిషాన అతని attitude చూస్తే తనమీద దయగా, ప్రేమగా వున్నాడనిపించింది. తరాతరాలనించీ అనాధలైన స్త్రీల అనుభవం, భర్త అధీనలై బిచ్చమెత్తిన పూర్వీకుల రక్తం, ఆమె అభిమానాన్ని చంపి, నోరువిప్పాయి. పిల్లవంక చూసింది. పిల్లకోసం తల్లి చేయలేని త్యాగం యేముంది అనుకుంది.

"డాక్టర్ని పిలవరా?" అంది.

"ప్రొద్దున చూద్దాం" అన్నాడు దయగానే. తన శరీరత్యాగం వ్యర్థం కాలేదనిపించింది, పాపం ఆ పిచ్చితల్లికి.

కాని పొద్దున్న సుందరమ్మ జ్ఞాపకంచేస్తే అతను వినిపించుకోకండా వెళ్ళిపోయినాడు. సుందరమ్మకి అతను తన మొహాన వుమ్మేసినట్టు, రాత్రి తాను వ్యభిచారం చేసినట్టు అనిపించి, తనమీద తనకే అమితమైన రోతకలిగింది. డబ్బుకి దేహాన్నమ్ముకుంది; పైగా ఆడబ్బుకూడా యివ్వక మోసంచేసి పోయినాడు.

మధ్యాన్నానికల్లా పిల్లకి రోగం యెక్కువకావడంతో తానారాత్రి చేసినపనికి దేవతలో దెయ్యాలో ఎవరో వొకరు తీవ్రంగా ఆగ్రహించి, తన పిల్లను తీసుకు పోతలుచుకున్నారని నిశ్చయించుకుంది.

వొంటరిగా. బతికే సుందరమ్మకి భయాలు తీర్చేవారెవరూ లేరు. వెర్రెత్తింది ఆతలపుతో. ఎట్లానన్నా డాక్టర్ని పిలిపించాలి. తనదగ్గర ఆరణాలు

వున్నాయి. గుమ్మందగ్గిర నుంచుంది. రోడ్డుమీది ఒక కుర్రాణ్ణి పిలిచి డాక్టర్ని పిలవమంది. తెల్లబోయి చూస్తోపోతున్నాడు. రెండణాలు చేతులో పెట్టి డాక్టర్ని తెస్తే యింకో రెండణాలు యిస్తానంది. దాంతో ఆకుర్రాడి హృదయం కరిగింది. ఆ నాలుగణాలతో డాక్టరువచ్చాడు. ఎనీమా యిచ్చాడు. పిల్ల అపాయస్థితిలో వుంది; ఇన్‌జక్షను యివ్వాలన్నాడు. ఇమ్మంది. మందు వ్రాసియిచ్చి తెచ్చుకోమన్నాడు. వాస్తవం వుట్టిపడే మొహంతో డబ్బులేదంది. ఆమె వాలకం చూసి అతను పిచ్చిది అనుకుని మాట్లాడకండా వెళ్ళాడు. నటనచాతగాక, Feelings దాచుకునే నేర్పు లేక, సహజంగా చరించే మానవుల్ని పిచ్చివారనుకుంటుంది లోకం.

రెండుగంటలసేపు అట్లానే కూచుంది. చీకటి పడుతోంది. వూరిబైటచెరువు మీద సూర్యుడు కుంకం చల్లుతున్నాడు. గట్టున స్కూలు పిల్లలు బంతి ఆడుతున్నారు. వూళ్ళోవంటిళ్ళల్లో మళ్ళు కట్టుకుంటున్నారు, రాత్రి పొట్టలు నింపుకునేందుకు పదార్థాలు తయారుచేయడానికని. భూమిమీద కొత్తపూలు పూశాయి; మళ్ళీపూశాయి. ఆకాశాన పాత నక్షత్రాలు మళ్లీ మెరిశాయి. సుందరమ్మ గది గోడమూల కిరసనాయిలు బుడ్డి వెలిగించి, పిల్లని కాళ్ళమీద పడుకోపెట్టుకుని, నల్లగుడ్లు సగం కనపడే కళ్ళవంక చూస్తో, చీకటి నీడలు కదిలే ఆగదిలో వొంటరిగా, "చిట్టీ, చిట్టీ!" అని పిలిచి 'వూ' అంటుందేమోనని తనబిడ్డ నోటిదగ్గర చెవిపెట్టి వింటోంది.

చంద్రశేఖరం చీట్లపేకలో కుదేలుబేస్తు గెలుచుకుని, తొడలు యెగరేస్తో, శ్వాస అమితంగా పీలుస్తో, పేకముక్కలతో నాపని చావబాదుతున్నాడు.

పిల్లకదిలి 'అమ్మా!' అని యేడ్చింది. ఆకేకతో సుందరమ్మ తన హృదయాన్ని అరగదీసి మందుగా ఆబిడ్డకి పొయ్యాలేకపోతినికదా అని యేడ్చింది.

"ఏమే అమ్మా! ఏమేనాతల్లీ! నేనేంచెయ్యనే! దిక్కుమాలిన పాపిష్టి దాన్ని. నేను నీకేంచెయ్యనే!" అని యేడ్చింది వొంటరిగా!

పక్కనయింటో పుట్టినపండక్కి ముత్తయిదులు తాంబూలాలుతీసుకుని నవ్వుతో వీధి వెంబడి బైలుదేరారు. సుందరమ్మకి తనచిన్నతనం జ్ఞాపకానికి వొచ్చింది. తనతండ్రిగాని తల్లిగాని వుంటేనా! ఎన్నిమందులు, ఎంతధైర్యం? ఏమైపోయింది ఆబ్రాహ్మణత్వం, ఆ మహత్యం; ఆదేవీప్రసన్నం, ఆవాక్ శుచిత్వం! తనకి, తన బిడ్డకి, యిద్దరికీ, ఏమదంవల్ల, తాను యీ మోహానికి

లోబడి, యీ చంద్రశేఖరంతో పాపంచేసి, ఎందుకు, తానిట్లా అధోగతి పాలయ్యింది? చేతులారా చేసుకున్న మహాపాతకానికి అనుభవించవొద్దా! కావి యీపిల్ల నోరులేని యీకూన, ఎందుకుబాధ యీపిల్లకి! మరి తన పాపపు కడుపున పుట్టినందునకిది శాస్తి!

పిల్ల మేలుకుంది. చూస్తోంది. ఏదన్నా, యెవరన్నా చికిత్సచేస్తే బతుకు తుంది. తనకింకేముంది యీలోకంలో ఆచిన్నపాపగాక! తానే యీ రోగాన్ని తెచ్చిపెట్టింది. ఏ త్యాగంచాతనైనా తానే నివృత్తి చెయ్యాలి. తనకేసి చూస్తోంది.

"అమ్మవి. నువ్వు నాకేంచెయ్యలేవా? ఈబాధని మాన్చలేవా?" అని చేతులు చాస్తోంది. ఆకళ్ళు తనని వేడుతున్నాయి.

"నాబాధ నీగుండె కరిగించటం లేదా? అట్లా కూచుంటావేం? నీ అభిమానం, నీ సోమరితనమేగాని, నువ్వేం చెయ్యలేవా, నిజంగా?" అంటున్నాయి వోణికే ఆ పెదిమలు!

అన్నాయా నిజంగా! ఏమో! మనం విన్నామనుకుంటున్న మాటలన్నీ నిజంగానే అంటున్నారా? మనమే కల్పించుకుంటున్నామా?

ఆమె అంతరాత్మ ఆమాటల్ని అలిట్లని కల్పించుకుందా? ఏమో మన అంతరాత్మలు యీలోకాన్నే కల్పించుకోటంలేదా?

ఇదంతా వాస్తవమైతే, అదంతా వాస్తవమే!

పిల్లని సముదాయించి పడుకోపెట్టింది. ఎవరు దిక్కు? మృత్యుదేవి హాస్తాలులేవా? తలుపు దగ్గరవేసి పరుగుతో సమానమైన నడక ప్రారంభించింది రోడ్డువెంబడి. బళ్లు, దీపాలు, దుమ్ము, మనుషులు అన్నీ నీడలు, ఆమె కళ్ళముందు ఏవీ కనపళ్లేదు.

"ఇంగ్లీషు మందుల షాపెక్కడ?"

అది వొక్కటేప్రశ్న. గోడల్ని, చెట్లని స్తంభాల్ని, అదేప్రశ్న!

"ఇంకావెళ్ళండి" అంటున్నారు యెవరో వొకరు.

"ఇంకానా? ఎంతదూరం? ఎంతకాలం?"

ఆమెని, ఆ పడమటితోవతప్పి, యీ మనుష్యమార్గాల అంధురాలై సంచరించే ఆ సంధ్యాదేవిని వికృతంగా చూస్తున్నారు ప్రజలు. కడుపునిండా సాయింత్రం భోజనంవేళైనాసరే, యిచ్చిన డబ్బుకి సంపూర్తిగా పోట్లాడి,

కాఫీహోటళ్లలో మెక్కి, కిళ్లీతో బిగించే కోమటికుర్రాడు, ఆఫీసునించి రొండిని మూటపెట్టుకుని సంతుష్టితో యింటివేపు నడిచే గుమాస్తా, ముందు బిళ్లజవాను ప్రజల్ని వొత్తిగిస్తోవుంటే, హోదాగా కర్రపట్టుకుని పక్కలకి చూచుకుంటో సాగినడిచే అధికారి, ఇంకా ఎంతసేపటికి విస్తళ్లు వీధులో పడతాయని ఒక కన్నుమూసి ఆలోచించే కుక్కలు—అందరూ చూస్తున్నారు "నాసంతానం, సంతాన"మని రోదించే జగన్మాత కడుపు శుంఖని కళ్లలో ప్రతిఫలిస్తో రోడ్డువెంట పరుగుతీసే సుందరమ్మని వింతగా.

అందరూ ఆత్మలు, అన్నిహృదయాలు—అంతా కరుణ—గుమ్మాల్లో కూచుని శూన్యంవేపు చూసే ముసలమ్మలు, గెంతుకుంటో యిళ్లకి పొయ్యే కుర్రాళ్ళు, గడ్డిమోపులకింద వొంగిపొయ్యే కూలి స్త్రీలు, అంతా, అన్నీ అన్నీ, ఆత్మలే, అన్నీ హృదయాలే, చూస్తున్నారు వింతగా, యీవెర్రి సుందరి పరుగును.

షాపులో యెలెక్ట్రిక్ దీపాలు, బుడ్లు, నీడలు, పటాలు, మనుషులు. అన్నీ అన్నీ భ్రమలు, ఆలోచనలు, మనసుమీది మసకలు ఆ మెకి—పిల్ల ఆత్మతో బాటు పైకిలేచిపోతున్న సుందరమ్మకి అన్నీ—నీడలు, మసకలు.

చీటీ ఆతని చేతుల్లో పెట్టింది.

"ఎన్ని గొట్టాలు ?"

తెల్లబోయి చూస్తోంది—వినడంలేదు—అతను మళ్లీ "ఎన్నిగొట్టాలు?" ఏమిటో అంటున్నాడు.

"తొరగా వెళ్లాలి నేను."

"ఎన్ని గొట్టాలు ?"

ఏమిటది ? అడుగుతున్నాడు ? ప్రయత్నించి భూమి మీదికి తెచ్చుకోవాలి మనస్సుని.

"ఇయ్యండి."

"ఎన్ని ?"

"ఇయ్యండి తొరగా."

బెంచీలమీది సోమరికబుర్ల విగ్రహాలు తలెత్తి చూశాయి, ఆమెవంక, ఈలోకంవేపు దృష్టిలేని ఆలావణ్య రేఖవంక.

"ఒకటా ? రెండా ?"

"తెలీదు."

విసుగెత్తింది అతనికి:

"ఒకటే రూపాయున్నది!......ఏమి? ఇవ్వండి!"

"లేవు రెండణాలున్నాయి."

ఆడబ్బు పడేసింది.

ఎవరో నవ్వారు. చుట్టూ చూసింది, వెర్రిగా. వాళ్ళ మొహాలు చూసింది. ఇదేమిటి? తనుయెక్కడవుంది? అవును అవును "తొరగా యియ్యండి."

"డబ్బులు"

"లేవు."

ఆమె వెర్రినాలకం, భయం, ఆపద, అన్నీ చూసి షాపువాడి మనసు కరుగుతోంది. కాని యజమానుడు తంతాడు. వాడూ దరిద్రుడే! అందరూ దరిద్రులే. కొంచెం యేమాత్రం హృదయమున్నవాడు ప్రతివాడూ దరిద్రుడే! చుట్టూ యింతబాధ, యింత మృత్యువు తాండవమాడుతో వుంటే, హృదయమున్న వాడిదగ్గిర లక్ష్మి యెట్లా దాక్కుంటుంది?

"ఎట్లా? వెళ్ళితీసుకు రండి."

ఒక్క నిమిషం నుంచుంది. అది యుగమనిపించింది. ఈలోకపు నిమిషాల లెఖ్ఖ—పగలు, రాత్రి, వారాలు, తేదీలు, అన్నీ దాటిపోయింది ఆమె ఆత్మ—బాధ బాధ అనే అనంతకాలంలో లీనమయింది.

అయ్యో! ఒక్క యుగం దాటిపోయింది. బిడ్డ, తన బిడ్డ, లేచిందా? వెతుక్కుంటోందా చీకట్లో? "నువ్వూ వొదిలావా అమ్మా" అనుకుందా? అట్లానే బిగుసుకుంటో చచ్చిపోయిందా? తనచెయ్యి మీదలే కుండానే, తనకళ్ళ భయంలేదని చెప్పకుండానే, వొంటరిగా, కాలరాత్రిలోకి ప్రయాణమయ్యిందా తన బిడ్డ? మరిచిపోయింది, మందుని, రెండణాలబిళ్ళని, తన వంకచూసే బెంచిమేస్త్రీటు రాఘవయ్యని, ఎవర్నీ చూడలేదు. చప్పున రోడ్డు మీద పడింది.

"ఎంత అందమైన మనిషో! వెర్రిపట్టింది."

"మదపిచ్చి!"

"వెంటవెళ్ళరా లాభిస్తుందేమో!"

"ఛి ఛీ!"

"ఒరే, ఆబుజాలూ తొడలూ చూశావురా !"

"బలేపిల్లరా !"

అంటోంది రెస్పెక్టబుల్ ప్రపంచం ఆమెవీపు వెనక.

మళ్ళావొచ్చిన దోవనే—రోడ్డుమీద—దుమ్ములో, చీకట్లో, బళ్ళని, సైక్లిళ్ళని తోసుకుని, బిచ్చగాళ్ళగుండా, దీపాలు, యిళ్లు, నక్షత్రాలు—అన్నీనీడలు, అన్నీమాయలు, అన్నీమసకలు, కలలు, గుండెల్లో కొరుక్కు తినే వేదన వొక్కటే నిజం. సత్యం. శాశ్వతం. వెళ్ళిపోతోంది. ఇదే యిల్లు. ఇదేగుమ్మం. లోపలే! బిడ్డ! బాధ, రోగం, మృత్యువు, చీకటి ఇదే గుమ్మం.

"చూడమ్మా!"

ఎవరు ?

అతను రామయ్యానాయుడు. గవర్నకులస్థుడు. తండ్రి జవానుపని చేస్తో చదివించాడు. క్రమంగా సొంత తెలివివల్ల తాలూకాబోర్డు ప్రెసిడెంటయి నాడు. లెజిస్‌లేటివ్ కౌన్సిలులోకి పోవాలని ఆశయం. దయార్ద్ర హృద యుడు. ప్రజలకు చాతనైనంతవరకు మేలుచేసినవాడు. ఆనాటి సాయంత్రం మందులషాపులో కూచున్నాడు. మందుల దగ్గిర కూచోడం అలవాటయి పోయింది. అది అతని తప్పుకాదు. ఇంకా గవర్ల స్వేచ్ఛ అలవాట్లని మరిచి పోలేని అతని భార్య తప్పు.

సుందరమ్మ వాలకం, ఆమెకళ్ళలోని నిరాశ, పెదవుల్లోని దీనత్వం గ్రహించాడు. అతని హృదయం కరిగి పోయింది. వుత్త గవళ్ళ రామయ్యే ఐతే ఆమెని అక్కడే పలకరించి వుండేను. కాని ఎక్సు ప్రెసిడెంటు రామయ్యకు పరస్త్రీని పలకరించడం నలుగురిముందూ మర్యాదైన పనికాదు. ఆమె వెళ్ళగానే యింటికి పోతానని లేచి, తెరవెనకాలకి వెళ్ళి ఆ మందు గొట్టం కొని, తొందతొందగా ఆమె వెళ్ళినమార్గాన్నే అనుసరించి గుమ్మంలో ఆమెని కలుసుకుని పలకరించాడు చాలా సదుద్దేశ్యంతో.

"ఎవరమ్మా మీరు ?"

"బ్రాహ్మలం."

ఆ ఒక్కమాటమీద సుందరమ్మ జీవితచరిత్ర, రామయ్య జీవిత కాలం, అతని కుటుంబం అదృష్టం, ఇంకా ఆ సంబంధంగా అనేక విషయాలు

తారుమారై పోయినాయి. ఆమాటే ఆమె అనక, ఇంకేదన్నా పలికి వుండును, ఆమెకింకా యెంతమంది సంతానం కలిగేవారో, ఇంకా యెన్ని కష్టాలకు సుఖాలకు లోనయ్యేదో. రామయ్య లెజిస్‌లేటివ్ కవున్సిల్‌కి వెళ్ళడం, మంత్రి కావడం, అతని కొడుకులు డిప్టీ సూపరెంట్లు కావడం, అతని కూతుళ్ళు ఐ.సి.ఎస్.ల్ని పెళ్ళిళ్లు చేసుకోడం, యెన్ని జరిగేవో!

ఆ వొక్కమాట! ఆమాట ఆమె ఆ సమయాన అని తీరవలసిందేనా! ప్రపంచచరిత్రలో అది inevitable అయిందా? ఇదివరకే ప్రపంచసృష్టిలోనే, ఇది నిర్ధారణ ఐపోయిందా? లేక సుందరమ్మ రామయ్యాల పూర్వజన్మ కార్యఫలితసంఘటనలవల్లా! లేక భూలోక వ్యవహారాల్ని కనిపెడుతో నడిపించే దేవతలు అట్లా శ్చయించారా ఆ నిమిషాన—నే నీకథని ఎట్లా అంతం చెయ్యాలో యీ నిమిషాన నిర్ణయించినట్టు? లేక ఆమాట అవసరం, సుందరమ్మ heridity వల్ల నిర్ణయింపబడ్డదా! "బ్రాహ్మలం" అనే గర్వపు పలుకు యుగయుగాల బ్రాహ్మణత్వం, బ్రహ్మజ్ఞానుల అధికార యోగ్యత, ఆమె నోటిలోంచి పలికిందా? సుందరమ్మ వృత్తి కులం సంగతి మాత్రమే చెప్పతలచుకుని వుండవొచ్చు. వూరుకన్న, పేరుకన్న, ఉద్యోగంకన్న, వంశం కన్న ముందు కులంసంగతి వెల్లడిచేసే యీ దేశాచారమే ఆమెని ప్రోద్బలం చేసి వుండవొచ్చు. కాని రామయ్యకి, ఆ పలుకులో బ్రాహ్మణాధిక్యత, గర్వం, తృణీకారం, గంభీరంగా వినపడి గుండెల్లో ఝల్లుమనిపించాయి.

దానికి రామయ్య పూర్వచరిత్ర, అతని పూర్వుల వృతచరిత్ర కారణం. ఇట్లా ఒక్కొక్క అల్పవిషయం యీ ప్రపంచంలో అన్నీ, అన్నీ, ఒకటే నిమిషాన, స్థలాన, ఒకటే కేంద్రంలో, ఒకదాన్ని ఒకటిదాటుతో కలుసుకుని లోకపు రహస్యాన్ని విడదీయ ప్రయత్నించే వేదాంతుల్ని శాస్త్రశోధకుల్ని, సయన్సువారిని పజుల్ చేసి వెక్కిరిస్తాయి. కర్మ, heridity, chance, fate, చరిత్ర, యీశ్వరేచ్ఛ, సృష్టిశక్తులు, అన్నీ, భిన్నంగా కనపడే యివన్నీ ఏకమేనేమో! అనేక మూలలనించి అనేకమంది యీ mystery ని సాధింప చూస్తున్నారు గావును!

రామయ్యకి బ్రాహ్మలంటే కోపం బ్రాహ్మణ వ్యక్తులమీద కాదు, ఆకులం మీద. ఈ కోపానికి, ఆ కోపం యీ నిమిషంలో కల్పించిన ఘోర పర్యవసానాలకీ, కృతయుగంనాటినించి వొచ్చే యీ వర్ణ భేదమూ, వర్ణస్థులూ,

కారణం. తండ్రి జవానుగా చాకిరిచేసే యింటో రామయ్య ఆ బ్రాహ్మల నించి పొందిన నీచత్వం అసలు పునాది. ఫలితం బ్రాహ్మణేతర సభ్యత్వం. ఫలితం బోర్డు ప్రెసిడెంటుగిరీ. దాంతో బ్రాహ్మణద్వేషం పాలిసీ. బ్రాహ్మణేతర నాయకులవలె పూర్వకాలం బ్రాహ్మలు బ్రాహ్మణేతరులకు చేసిన ద్రోహాల్ని గురించి అతను పరిశోధన చెయ్యలేదు. అతని ద్వేషం intellectual మాత్రమే గాక, ముఖ్యం emotional.

రామయ్యే హిందూ విజ్ఞాన చరిత్రను నిష్పక్షపాతబుద్ధితో చదివివుండి నట్టయితే, యీ బ్రాహ్మణత్వమే, • ఆ ప్రత్యేకత్వమే, ఆ బేధభావమే, బ్రాహ్మణ తపోప్రయత్నాలకు, ఆధ్యాత్మిక ఆశయాలకు, ఆశుచిత్వమే, ఆ ఆచారమే యెట్లా అవసరమై, ఎన్నడూ, యే దేశీయులూ అందుకోలేని, ధర్మాన్ని, కళను జీవితాన్ని, సూక్ష్మ వేదాంతరహస్యాన్ని, యోగమంత్ర శక్తుల్ని, తమకేగాక, యేనాడో లోకాన్నంతా ఉద్ధరించగల ఆత్మతత్వాల్ని సాధించేందుకు బ్రాహ్మలకి ఎట్లా సహాయపడ్డదో తెలుసుకుని వుండును. ఏమైతేనేం, యీ Inferiority complex తో నేత్రాలంధమైన కాలంలో, ఎట్లా అంతకన్న ఔన్నత్యాన్ని ప్రయత్నించగలడు రామయ్య! Creature of the times!

అతని ఆశయం ఒక్క బ్రాహ్మణ స్త్రీతో సంభోగం చేయాలని. ఎందుకు? అని ప్రశ్నిస్తే ప్రత్యుత్తరం అతనికే తెలీదు. నిజం. తనలో నిజాగా లేనికసిని వెళ్ళకక్కుతాడు. చిన్ననాడు, తనతండ్రి పనిచేసిన బ్రాహ్మణగృహంలో, తాను ఆరాధించిన, తనయీడుదే ఆ బ్రాహ్మణకన్య. అతన్నిచేసిన హేళనా, అతనిచేత చేయించుకున్న పనులూ, ఎంతకైనాపోని అతనికి ఆమెమీద గల గౌరవం, యివి కారణాలని psycho-analists అనవొచ్చు.

అతను సుందరమ్మని ఆపాపులో చూసి వాస్తవంగా, నిర్వ్యాజంగా జాలి పడ్డాడు. అతనిలోని దేవత్వమే పాలించింది. ఒక మానవుడు, హృదయ మున్నవాడు రెండో మానవుడికి యిచ్చే సానుభూతినే యిచ్చాడు. కాని ఆమె "బ్రాహ్మలం" అన్నంత మాత్రాన, యింతసేపు ఎక్కడో అడుగున దాక్కున్న కులద్వేషం, రాక్షసత్వం, అధికారాన్ని పూనింది. అతను, మనుష్యుడు కాడు, అప్పుడు దేవుడు కాడు, ఆత్మ కాడు, హిందువుడు కాడు, హిందూదేశసుడుకూడ కాడు. వుత్తనాయుడైనాడు.

"బ్రాహ్మలా, ఆ...ఆ...ఆ!"

మనసు చురుకుగాపనిచేస్తోంది, ఇన్ని సంవత్సరాలనించి ద్వేషంపోసి భద్రంగా పెంచుకుంటున్న తన ఆశయం యీనాటికి నెరవేరే సమయం వొచ్చిందా?

"ఏదీపిల్ల!"

"మీరు డాక్టరా ?" అంది జాలిగా సుందరమ్మ, ప్రతి అక్షరంలోనూ ధ్వనించే ఆశ రామయ్య ఆ నిమిషాన నాయుడే కాకపోతే మనుషుడే ఐతే ఆ కంఠంలోని నిర్మలత్వం, మాతృత్వం, దీనత్వం, అతన్ని సిగ్గుతో పాతాళానికి తొక్కివేసి వుండును.

అతికష్టంతో, తనహృదయాన్ని తొక్కిపట్టి, సహజ దేవత్వాన్ని నోరు నొక్కి, "ఊఁ" అంటూ లోపలికి వెళ్ళాడు. అబద్ధాలు ధైర్యంగా పలికే సాహసం యింకా సంపాయించలేదు, బోర్డు ప్రెసిడెంటైనాకూడా.

ఆ యింటిమీద తాండవించే మృత్యువుని, గోడల కెగబాకుతున్న చీకట్లనీ, బొద్దింకల్నీ, ఆబిడ్డనీ, ఆమెనీ, ఆమె దిక్కులేనితనాన్ని, ఆమె సౌందర్యాన్ని, దేన్నీ చూడటంలేదు, నాయుడికళ్ళు. గతంవేపు తిరిగి, తన కార్యదీక్షలో, తన జీవితాశయంలో లీనమైపోయినాయి. దేవతల కరుణ యెట్లావుందో అని ఆలోచిస్తున్నాడు.

సుందరమ్మ దేవతలు తనకై పంపిన యీ అనాయాచిత, మిత్రత్వానికై, భక్తితో, కృతజ్ఞతతో కుంగిపోతోంది.

బిడ్డ, బాధల్నీ, తల్లినీ, శుష్కశరీరాన్నీ వొదిలి ఆనందకోశంలోకి, retreat అవుతోంది.

సుందరమ్మ పిల్లవంకచూసింది, ఆశతో అతనివంక చూసింది. చీకటయిందిగాని, వెలుతురులోనే ఆమె కళ్ళని అతను చూసివుంటే, ఎంత అడుగున పడిపోయినదైనా రామయ్య మానుషత్వం, ఆవొక్కచూపుతో, సమస్త మోహమేఘాల్ని చించుకుని, ఆమెపై ప్రసరించివుండేది, కాని విధి తలపెట్టినప్పుడు, సంఘాల నన్నిటినీ, ఏ విఘాతానికీ సలమివ్వక, అతినిపుణతతో, perfect గా తయారుచేస్తుంది. Fate చేసే ప్రయత్నంలో human error కి ఏమాత్రమూ ఎడముండదు.

"మరి...మరి" అని రామయ్యనాయుడు పెదిమలు తడుపుకుంటున్నాడు. అతనికి అనుభవం లేదు. స్త్రీలోలుడు కాడు.

"ఏమిటి !"

"నాకేమిస్తావు ?"

"ఏముంది ? ఏంలేదునాకు—దిక్కులేని...." అతనిచెవులు యెప్పుడో మూతలుపడ్డాయి. శబ్దంతప్ప, ఆశబ్దంలోని మృదుత్వం, కారుణ్యం, వినపడవు అతని కిప్పుడు. ఈలోకంలో లక్షలమందికి ఎన్నడూ వినపడవు.

"నువ్వు కావాలి !"

"నేనా !!!!" అన్న అరుపును, ఆ ఆశ్చర్యాన్ని, ఆ భయాన్ని, సందేహాన్ని, యేదేవుడన్నా విన్నాడా ? చెవులు వున్నాయా ? ఈరోదన వినపడుతుందా ? నేలమీద పడివున్న బిడ్డకేసి చూస్తూ, 'నేనా ?' అన్న ఆ దిక్కుమాలిన తల్లి మొర !

ఎందరు స్త్రీలు, యెందరు పతివ్రతలు, సుశీలలు, అన్నారో యిట్లా 'నేనా' అని, తమకున్న మానధనాన్ని ఆశించిన పురుషుల ముందు.

ఒక్కనిమిషమే యోచించింది. ఆమనిషి, దేవుడివేషంలో ప్రత్యక్షమైన యీరాక్షసి, ఆయిల్లు, తన కాపరం, తన పేరు, తన జీవితం, దేహం అభిమానం, తనపిల్ల, తనశుచిత్వం, అన్ని కలలు, మాయ, మనోపటంమీద చలించే యింద్రజాలాలు. తను, తనే, తనబాధే, అదేవాస్తవం. నిన్న రాత్రి భర్త అనేపురుషుడు, యీరాత్రి వీడెవడో, యీపురుషుడు కాని భర్తకన్న యితనే సత్యసంధుడు కావొచ్చు. ఏమైతేనేం ? ఏం జరిగితేనేం ? ఆలోచనలోకాన్ని, సందేహకాలాన్ని అతిక్రమించింది. మృత్యువుముందు ఆత్మ కాళ్లనించే గడపతొక్కి వూర్ధ్వలోకాల దృష్టి నిలిపింది. ఈ దేహాన్ని కాలిస్తేనేం ? అనుభవిస్తేనేం, ఆ కట్టెని ?

ఏమీమాట్లాడలేదు. మౌనం అంగీకారంగా తీసుకున్నాడునాయుడు.

ఆ చచ్చిపోతున్న పిల్లపక్కన, ఆ కిరసనాయిలు బుడ్డి ముందు కదిలే బికారి నీడల్లో, సుందరమ్మని కావిలించుకున్నాడు. దేవతలు కలలు గని సృష్టించిన సుందరమ్మ పవిత్ర దేహాన్ని, ఆమె అందాన్ని చూడలేదు అతను. ఆమె నిర్మలత్వాన్ని గుర్తించలేదు. ఆమె నిర్లక్ష్యంతో పనిలేదు. ప్రాణమున్నదా అనే పరీక్షకూడా లేదు. అతనికసలు సౌందర్యమంటే యేమిటో తెలీదు. స్త్రీ మనఃపూర్వకంగా యివ్వగల స్వర్గపు అంచులకన్నా అతనెన్నడూ సామీప్యానికి **వెళ్ళలేదు. బ్రాహ్మణ స్త్రీ దొరికింది. జీవితాశయం నెరవేరుతోంది.**

ఆమె—యిక్కడ యీ లోకాలలోనే లేదు. ఆ బిడ్డ—ఆ బిడ్డ యే సహాయమూ అందని సలాలు యీభూమిని మించిన planes లోని అందాన్ని గురుపట్టి తేలవేసిన గుడ్డలో—లోపల లోపల నవ్వుతుంటోంది.

సుందరమ్మ రక్తంలోకలిసి జీవించిన బ్రాహ్మణ ఆత్మలు, జపాలు, తపాలు, శ్రోత్రియం, యజ్ఞాలు, ఆధ్యాత్మిక సంపద, ఆధిక్యగర్వం, శూద్రుణ్ని గుమ్మమవతల, జ్ఞానానికి అవతల, శాస్త్రాధికారానికి అవతల నుంచోబెట్టిన అధికారం, "అయ్యో, అయ్యో" అని అరుస్తున్నాయి.

బ్రాహ్మలనించి, అన్యాయాన్ని, అవమానాన్ని, తృణీకారాన్ని, వోపికతో, యుగాలు భరించిన శూద్రుల అంధకారం, మౌఢ్యం, క్రూరశిక్షల్లకు, పక్షపాతాలకిపాలై నశించిన, మనుశ్రుతినాటి, శూద్ర ఆత్మల క్రౌర్యం; సేవలో, దాస్యంలో, కుంగి, తోవ తెలియక, పెనుగులాడుతున్న వేదన, నిరాశ; బ్రాహ్మలచేతుల్లో చిక్కి, మానాల్ని ప్రాణాల్ని అర్పించిన శూద్ర వనితల అవమానాగ్ని, కసి, అన్ని ఆతని రక్తంలో తాండవమాడుతో, తృప్తి నొంది, అనంతకాలంలోని నిద్రకై పరుగులెత్తుతున్నాయి.

తమవంశీయురాల్ని, శుద్ధపవిత్రబ్రాహ్మణరక్తాన్ని, ఆక్రమించుకుని, అపవిత్రం చేస్తున్న, ఈ అధోవర్ణస్తుణ్ణి ఏం చెయ్యలేక, చుట్టూమూగి, ఆమెఆత్మని, అన్వేషించి, ఆహ్వానిస్తున్నారు, పూర్వులు ఆ మలినమైన శరీరంలోంచి లేచిరమ్మని.

... ... ...

"ఇవ్వండి."

"ఏమిటి ?"

మరిచిపోయినాడు.

అతని దృష్టి తృప్తివేపు, ఆమె దృష్టి బిడ్డవేపు.

"ఇంజక్షను యివ్వండి."

"నేను డాక్టర్ని కాదు."

ఎందుకన్నాడు ఆమాట! ఆబ్రాహ్మణస్త్రీ దేహానికి చేసిన గాయంకాక, హృదయానికి శాశ్వతమైన గాయం చేద్దామనా! లేక అబద్ధమాడడం చాతగాకనా ? మాట్లాడకండా వెళ్లిపొయ్యే ధైర్యం లేకనా, కఠినత్వంలేకనా? ఎవరికి తెలుసు ? ఎవరు చెప్పగలరు ? అతని అల్పత్వమో, అతని ధీరత్వమో, అతన్ని అట్లాపలికించింది? అతనికే తెలీదేమో! అడిగినా చెప్పలేడేమో ?

ఆలోచించి చెప్పినా నిజం కాదేమో! ఎవరు చెప్పగలరు? కార్యాలకు నిజమైన ఉద్దేశ్యాల్ని కర్తలకే తెలీవు! పైగా నీతి, అవినీతులని, ధర్మ అధర్మాలని, స్పష్టంగా విడతీయ బూనుకుంటారు, నీత్యాధికారులు!

సగం యీలోకాన్ని అప్పుడే దాటిన సుందరమ్మ ప్రాణాలు కడపటి ప్రయత్నం చేశాయి, తమ శరీరానికి జరిగిన యీ తీవ్ర న్యూనతని పరిహారం చేసేందుకై. అంత మన్మథ ప్రయత్నంలోనూ చలించక గడ్డకట్టిన సుందరమ్మ రక్తం, పెద్ద ఘోషతో మేలుకుంది. హృదయద్వారాల సముద్రపు వరదవలె వొచ్చి ప్రవేశించింది. చంపలు తళతళమన్నాయి. కళ్లు అగ్నివలె మెరిశాయి. వక్షం దీర్ఘ ఉఛ్వాసంతోటి నిండిపోయింది. నడుమూ, కంఠమూ, మహాశీవితో పైకి లేచాయి. ఈలోకపు సంకుచిత వాసనల్ని, శరీరపు స్వల్ప బంధనాల్ని, తెంచుకున్న ఆమె ఆత్మ అతిక్రమించి, పూర్వలోకాల జ్వలించే మహాశక్తులతో, బ్రాహ్మణ తేజస్సుతో సంబంధం కల్పించుకుంది ఆనిమషాన.

ఆ దివ్యవిగ్రహాన్ని, ఆ మహాసౌందర్యాన్ని ఒక నిముషంకింద తన చేతుల కింద, తొడలికింద నిర్జీవమై పడివున్న కళేబరంలో ఆ నూతన విద్యుచ్ఛక్తిని చూసి, విభ్రాంతుడై, వెనక్కి నాలుగు అడుగులు వేశాడు రామయ్య.

ఏం జరగబోతోంది? చంపుతుందా? మీదదూకి చీలుస్తుందా! ఏమిటా చూపు? ఏమిటా శబ్దంలేని పెదిమల చలనం?

ఎవరు? సాధారణమానవురాలేనా? రాక్షసి, దెయ్యం, మహామ్మారి, మహిషాసురమర్దని, శక్తి, కాళీ—

ఇంకో కాలు వెనక్కి వేశాడు, ఆమె కళ్లలోనించి జ్వలించే వెలుగును భరించలేక భగ్గుమని మండిపోయినాడు. నిలువునా కాలిపోయినాడు. భస్మమైనాడు.

వెనకనే మండేదీపం వేళ్ళాడే అతని పంచ కంటుకుందా? అతని శరీరంలోనించి, కాళ్లమధ్యనించి లేచిందా ఆ మంట?

సుందరమ్మా—ఏయిమందో? ఏం జరిగిందో? నిలువునా, పిల్లమీద పడివుంది. బైట గాయంలేదు. లోపల విషంలేదు.

బ్రాహ్మల కడపటి మహత్యం బ్రాహ్మణీకం. యీ కలియుగానికి—సుందరమ్మతో అంతమయింది.